CHAITANYAMANAVI
R.NO.APBIL/2019/78298



# చైతన్య మానవి

VOL : 3 ISSUE : 6,7 GUNTUR JUNE, JULY 2021 56 PAGES RS. 20/-

## శత జయంతి ప్రత్యేక సంచిక

ఉద్యమాల కాంతి..

సామ్యవాద లక్ష్యం..

స్త్రీ విముక్తికి మార్గదర్శిని..

మీ మార్గం మాకు శిరోధార్యం..

- కరుణాకర్










# సేవాతత్పరతతో..

కరోనా విజృంభించి జనం అల్లకల్లోలమవుతున్న తరుణంలో బాధితులకు ఐద్వా, వామపక్ష ప్రజాసంఘాలు అండగా నిలిచాయి. ఐసోలేషన్ కేంద్రాలు ఏర్పాటు చేసి కరోనా బాధితులకు సేవలు అందించారు. బాధితులకు అవగాహన కల్పించడం, వంటలు చేసి పెట్టడం లాంటి కార్యక్రమాలు రాష్ట్ర వ్యాప్తంగా జరిగాయి.



2

సంపాదకీయం

## ఆశయాలకు పునరంకితం అవుదాం.. అమానుష పాలనపై గళమెత్తుదాం!!

మా నికొండ సూర్యావతి గారు ఆంధ్ర రాష్ట్ర మహిళా ఉద్యమ నిర్మాత. ఓ తరానికి చిరపరిచితమైన ప్రియతమ నాయకురాలు. ఆమె శతజయంతి సందర్భంగా చైతన్య మానవి ఆమె ఆశయాలకు అంకితమవుతూ ఈ ప్రత్యేక సంచికను మీ ముందుకి తీసుకొస్తోంది.

సోషలిస్టు సమాజ నిర్మాణమే మహిళా విముక్తికి మార్గం అని స్వాతంత్రోద్యమంతోపాటు సోషలిస్టు సమాజ స్థాపన కోసం అవిశ్రాంతంగా కృషి చేసిన మహనీయురాలు ఆమె. ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలో ఆమె నిబద్ధురాలైన కార్యకర్త. సంఘ సంస్కరణోద్యమంలోనూ మహిళల హక్కుల సాధనలోనూ ముందు పీఠిన నిలబడి నిర్మాణ రూపం ఇచ్చిన నేత.

మానవ సంకల్పంతో మహత్తర మానవశక్తిని వినియోగించుకుంటూ సగౌరవంగా జీవితాన్నిస్తున్న సోషలిస్టు వ్యవస్థ ఒకవైపు! మరోవైపు కంటికి కనిపించని కరోనాను అరికట్టలేని చేతకానితనం. ప్రజల ప్రాణాల కంటే, జీవితాల కంటే కంపెనీల లాభాలే ముఖ్యమని భావించే సామాజిక,రాజకీయ వ్యవస్థ పాలన ఫలితమే ఇది.

మన దేశ జనాభాలో 84 శాతం మంది ప్రజలు ఇతర మతాలను గౌరవిస్తారని ఇటీవల ఓ సర్వే తేటతెల్లం చేసింది. మత చాందసాలను రెచ్చగొట్టి అధికార పీఠాన్ని అధిరోహించిన నేతలు ఎల్లకాలం సాగించలేరని అనుభవాలు ప్రజలకు అవగతమవుతున్నాయి. మతం పేరుతో దారుణ హత్యాకాండ జరిగిన ముజఫర్ పూర్ ఈరోజు హిందూ ముస్లిం భాయి భాయి అంటూ ఉద్యమ బావుటా ఎగరేసింది. మన దేశ బహుళ సంస్కృతిని చాటుతున్నది.

వ్యక్తి స్వేచ్ఛ స్వాతంత్రోద్యమ కాంక్ష. అందుకు బతుకు మీద భరోసా కావాలి. కానీ నేటి కేంద్ర రాష్ట్ర పాలకులు ఈ భరోసాను బలి చేస్తున్నారు. హైర్ అండ్ ఫైర్ పేరిట సాధించుకున్న చట్టాలకు స్వస్తి పలుకుతున్నారు. జాబ్ చార్టర్ పేరిట జాబ్ లెస్ ప్రకటన చేసి చేతులు దులుపుకునే ప్రయత్నం చేస్తున్నారు.

జార్జి ఫ్లాయిడ్ హత్య. జాతి అహంకారంతో హత్య చేసిన అతనికి శిక్ష పడింది అమెరికాలో .మరి మన దేశంలో కూడా కనీసమైన ఈ న్యాయాన్ని పొందగలమా అని అణగారిన వర్గాలు ప్రశ్నిస్తున్నాయి.

సార్వత్రిక వాక్సిన్! పక్కనే ఉన్న చైనా 130 కోట్ల జనాభాకు టీకాలు అందించగలింది. మరి మనం 8 శాతం మంది మాత్రమే టీకా వేయించుకో గలిగారు. ఎందుకు ఇంత వ్యత్యాసం?

ప్రజలకు కు కనీసం ఆసరా ఇచ్చిన ప్రభుత్వ వైద్యానికి మంగళంపాడే విధానాలే నేటి పాలకులకు ప్రీతిపాత్రం. ఉద్దీపన పేరుతో ప్రభుత్వ సొమ్మును ప్రైవేటు ఆస్పత్రుల నిర్మాణాలకు పందారం చేస్తున్నారు. ఆరోగ్య నగరాల పేరిట రాష్ట్ర ప్రభుత్వం ఇందుకు తానా తందానా అంటున్నది.

అందరికీ విద్య మన రాజ్యాంగ లక్ష్యం .ఈ ఆలోచనను కూడా సమాధి చేయడానికి నూతన విద్యా విధానం తెచ్చారు. దళితుల తోపాటు, అణచివేయబడ్డ వర్గాలతోపాటు, బాలికల విద్య సంపూర్ణంగా నాశనం కాబోతున్నది. ఉన్న ఊర్లో పాఠశాల లేకపోతే ఆడపిల్లలను వేరే గ్రామాలకు పంపించి చదివించ కలిగే పరిస్థితులు ఉన్నాయా? వృత్తి విద్య నేర్పడం పేరుతో కారుచౌకగా దళిత,పేద కుటుంబాల నుండి కార్మికుల ను తయారుచేసే మార్గం ఇది.

నివాస ప్రాంతాల్లో కనీస అవసరాలు కల్పించాల్సిన బాధ్యతను వదిలేసి అన్నింటి మీదా పన్నులు వేయడం ప్రారంభ మైంది చెత్త తో సహా. అంబానీ,అదాని ఆస్తులకు పెంపుదలకు సహకారం. సాధారణ మధ్యతరగతి జనంపై పన్నుల మోత.

ఇదా మనం ఆశించిన పాలన. ఎన్నికలు ఇందుకోసమేనా? ఆధునిక దొరల ప్రయోజనాల కోసం కాదా నేటి పాలకులు విన్యాసాలు! అలనాడు బ్రిటిష్ వాడు గోళ్ళూడ కొట్టి వసూలు చేసిన చరిత్ర గుర్తుకు వస్తున్నది కదా. అగ్ర రాజ్యాలు ప్రపంచ బ్యాంకు ను సాధనంగా చేసుకుని దేశం మీద రాష్ట్రం మీద దోపిడి పద్ధతులను పెంచే పాలన కాదా ఇది? ప్రపంచ బ్యాంకు ఇచ్చే 1825 కోట్ల కోసం విద్యా వ్యవస్థను నాశనం చేయడం ఎవరి లాభాల కోసం? విద్యుత్ ప్రైవేటీకరణ, రైతు చట్టాలు, కార్మిక కోడ్లు సారాంశం సామాన్యుల జీవితాలను కట్టుబానిసలా గా మార్చడం కదా!

1993 ప్రజా సంఘాల సభ. సూర్యావతి గారు ఈ విధానాలపై మరో సమరానికి పిలుపునిచ్చారు. సుదీర్ఘ కాలం యువతను ఈ పాలకులు రకరకాల పేర్లతో భ్రమల్లో పెట్టగలిగారు. కానీ పెరుగుతున్న నిరుద్యోగం, పాలకుల అవినీతి, మోసాలు, యువత మెదళ్లను చిలుకుతున్నాయి. పోరాడుతున్న రైతు ఉద్యమాలతో కలిసి ముందడుగు వేయాల్సిన కాలమిది. అన్యాయాన్ని ప్రశ్నిస్తున్న యువతులవైపు నిలవాల్సిన కాలమిది. స్వదేశీ నల్లదొరలు, విదేశీ దోపిడీదారులతో చేతులు కలపడాన్ని ప్రశ్నించాల్సిన కాలం. చేతులు బిగిద్దాం. ప్రశ్నిద్దాం. మార్పు కోసం సమైక్యంగా సాగుదాం. నిజమైన నిజమైన ప్రజాస్వామ్యం, ప్రజల స్వేచ్ఛకు సోషలిస్టు సమాజమే మార్గమని విశ్వసించిన సూర్యావతిగారి బాటలో నడుద్దాం.

# చైతన్య మానవి

సంపుటి: 3
సంచిక: 6,7


ఏ దేశంలోనైనా శాస్త్రీయ ఆలోచన యొక్క, కళల యొక్క చరిత్రను అర్థం చేసుకోవాలంటే ఆ దేశ ఆర్థిక రంగం ఒక్కదాన్ని గురించి తెలుసుకుంటే సరిపోదు. అక్కడి ఆర్థిక రంగం నుంచి సామాజిక, మానసిక స్థితిలోకి వెళ్లడమెలాగో నేర్చుకోవాలి.




**ఐద్వా ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం**

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
పి.ఎల్.రావు భవన్, 2/7 బ్రాడీపేట,
గుంటూరు, గుంటూరు జిల్లా - 522002,
ఆంధ్రప్రదేశ్, ఫోన్ : 9490098620
chaitanyamanavi@gmail.com
fb : aidwaap
Blog : aidwaap@blogspot.com



**సంపాదకులు**
**డి.రమాదేవి**

**సంపాదక వర్గం**
కె. స్వరూపరాణి
బి. ప్రభావతి
బి.హరిత

మేనేజర్ : కె. శారద

ప్రజాశక్తి ప్రింటర్స్ & పబ్లిషర్స్ ప్రైవేట్ లిమిటెడ్

**పోస్టల్ చందా**
సంవత్సరానికి రూ : 150/-
విడి ప్రతి వెల రూ : 10/-

వ్యాసాలు, లేఖలు పంపించవల్సిన చిరునామా :
డోర్‌నెం. 31-5-6, మారుతీనగర్,
ప్రకాశరావు వీధి, చుట్టు గుంట సెంటర్,
విజయవాడ - 4


## ఈ సంచికలో






PRINTED AND PUBLISEHD BY D. RAMA DEVI, AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM, PRINTED AT PRAJASAKTI PRINTERS & PUBLISHERS PVT. LTD. 14-12-19, PRAKASH NAGAR, KRISHNA NAGAR (P), TADEPALLI (M), GUNTUR DIST.PUBLISHED AT AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM AIDWA STATE OFFICE P.L.RAO BHAVAN, 2/7 BRODIPET, GUNTUR-522002, ANDHRA PRADESH STATE. EDITOR: D. RAMA DEVI. R.NO. APBIL/2019/78298

వి.విప్లవజ్యోతి

## కార్యశీలి
# మైథిలీ శివరామన్



పైకప్పుల్లేని పూరిళ్లు.. గోడల్లేని గుడిసెలు.. నేలమట్టమైన, కాలి బూడిదైన పాకలు.. పగిలిన మట్టిగాజుల ముక్కలు చెల్లాచెదురుగా పడున్న గుడిసెలు కీలవన్మేణి (తమిళనాడులోని ఒక గ్రామం) అగ్రకుల భూస్వాముల క్రౌర్యాన్ని బట్టబయలు చేస్తూ మైథిలి శివరామన్ రాసిన ఒక వ్యాసపు ప్రారంభ వాక్యాలివి. ఆమెను తలుచుకోవడం కూడా ఆ మాటలతోనే మొదలు పెట్టాలనిపించింది. మరి కాలిబూడిదైపోయిన ఆ గుడిసెలే కదా మైథిలిని అంతరాల్లేని సమాజ స్థాపన దిశగా పని చేసేలా చేసింది. ఆ గుడిసెలలో బుగ్గిపాలైన నలభై నాలుగు ప్రాణాలే కదా ఆమెను అన్ని రకాల అణచివేతలకు వ్యతిరేకంగా పోరాడే జీవితకాలపు కార్యకర్తగా మార్చింది. తన సర్వశక్తులనూ ఉద్యమాలలోనే పెట్టేలా చేసింది. ఇంతకీ అంతకు ముందెవరామె? ఉద్యమాలవైపు ఆమె అడుగులు ఎలా పడ్డాయో తెలిపేదే ఈ కథనం..

అక్కకు చేసినట్లు నాకు చేయకండి. ఒక తమిళ మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబం తనది. ఎనభై ఒక్క ఏళ్ల క్రితం అంటే స్వాతంత్ర్యం రావడానికి ఏడేళ్ల ముందు కాకినాడలో పుట్టింది. వాళ్లతాత ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వంలో ఉద్యోగ రీత్యా కాకినాడలో ఉండటంతో తల్లి కాన్పు కోసం పుట్టింటికి వచ్చింది. పెరిగింది, చివరిదాకా ఉన్నది మద్రాసులో. విస్తృతంగా చదివే అలవాటున్న అమ్మమ్మ, అమ్మలకు వారసురాలు. వాళ్ల నుంచి ఆ చదువరితనాన్ని అలవరచుకుంది మైథిలి. ఆ తెలివిడితోనేననుకుంటా వైవాహిక జీవితాలు వాళ్లనెంతగా ఇరుకు చట్రంలో బంధించాయో కూడా అర్థం చేసుకుంది.

**ఐదుగురు సంతానం ఉన్న ఇంటిలో చివరి బిడ్డతను. 'అక్కకు 19 ఏళ్లకు పెళ్లి చేసినట్లు నాకు చెయ్యకండి. నేనందుకు సిద్ధంగా లేను. పైచదువులు చదువుతాను' అని స్పష్టంగానే చెప్పింది ఇంట్లో వాళ్లకు. తమకది నచ్చకపోయినా తప్పక ఒప్పుకున్నారు. అలా మైథిలి తన జీవితాన్ని తన చేతులలోకి తీసుకోవడం అప్పుడే మొదలు పెట్టింది.**

పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్‌లో పిజి డిప్లొమా ఢిల్లీలో చదివింది. ఆ పైన చదవడం కోసం 1963లో న్యూయార్క్ వెళ్లింది. పెత్తందారీ దేశంలోనే తనుంది. అమెరికాలోని నల్లజాతి ప్రజలు మార్టిన్ లూథర్ కింగ్ నాయకత్వాన సమాన పౌరహక్కుల కోసం ఉద్యమిస్తున్నకాలం. బడిలో, రెస్టారెంట్లలో, బస్సుల్లో ఇలా సమస్త బహిరంగ ప్రదేశాల్లో విడివిడిగా ఉంచడాన్ని నిషేధించాలని ఉవ్వెత్తున ప్రదర్శనలు జరుగుతున్నాయి. మరో పక్క వియత్నాంపై అమెరికా చేస్తున్న యుద్ధానికి, దాని సామ్రాజ్యవాద స్వభావానికి వ్యతిరేకంగా వేల సంఖ్యలో విద్యార్థులు వీధుల్లోకి వస్తున్నారు.

మాల్కం ఎక్స్ నేతృత్వంలో నల్లజాతి విముక్త

ఉద్యమం ఊపందుకుంది. వీటన్నిటి ప్రభావం ఆమెపై పడింది. తన చదువు పూర్తిఅయిన తర్వాత ఆమె ఐక్యరాజ్య సమితిలో భారతదేశం నుంచి ఉన్న శాశ్వత కమిటీలో (డీ కాలనైజింగ్ కమిటీ) రెండేళ్లు పనిచేసింది. ఆ అనుభవంతోనే అమెరికాలో చదువుకున్నావు అక్కడే పనిచేయవచ్చుగా అన్న అక్కతో అమెరికా ఐక్యరాజ్య సమితి వేదికల మీదే మూడో ప్రపంచ దేశాలను చులకన చేయడం, బలవంతంగా తన దారికి తెచ్చుకునే ప్రయత్నం చేయడం చూశాను. "అది పెత్తనం చేసే దేశం. అలాంటిచోట నేనెందుకు ఉండాలి" అని అన్నదట.

మెత్తటి స్వభావమే అయినా అనుకున్నది చేసే పట్టుదల, అందుకు అవసరమైన సాహసం ఆమెలో దండిగా ఉన్నాయి. అందుకే రాకపోకలపై ఆంక్షలున్నా లెక్కచేయకుండా, సామ్యవాద దిశగా సాగుతున్న క్యూబా పయనాన్ని కళ్లారా చూడడానికి అక్కడికి వెళ్ళింది. తన పాస్‌పోర్టు మీద క్యూబా ముద్ర ఉంటే అమెరికాకు తిరిగిరానివ్వరని క్యూబా నుంచి తిరిగివచ్చేటప్పుడు మిత్రుల సహకారంతో ప్రయాణికులు వచ్చే విమానంలో కాకుండా తపాలా శాఖ నడిపే విమానంలో సరుకుల మధ్య కూర్చుని మెక్సికోకు చేరి అక్కడ నుంచి అమెరికా వెళ్ళింది.

**క్యూబాలో మంత్రులు, అధికారులు, ప్రొఫెసర్లు, డాక్టర్లు ఇలా మేధోపరమైన వృత్తులలో ఉన్నవాళ్ళందరూ వారానికి ఒకరోజైనా, రోజులో కొన్ని గంటలైనా కచ్చితంగా బస్తాలు మోయడం, పొలాల్లో పనిచేయడం లాంటి శారీరక శ్రమ చేయడం ఆమెను ఉత్తేజపరిచింది. శారీరక శ్రమ, మేధోపరమైన పనికి మధ్య ఉన్న అంతరాలను చెరిపివేయడానికి, శారీరక శ్రమకు ఇవ్వాల్సిన గౌరవాన్ని, విలువని ఇవ్వడం కోసం అలా చేశారట.**

చాకిరీని కొన్ని కులాల వారికి పరిమితం చేసివారిని చులకనగా చూసే భారతదేశం నుంచి వెళ్ళిన ఆమెకది అబ్బురంగా అనిపించింది. అమెరికాలో ఉన్న కాలంలో అక్కడి స్నేహితుల మధ్య సహజంగానే ఈ అంశాలన్నీ చర్చకు వచ్చేవి. 1968లో భారతదేశానికి తిరిగి వచ్చేనాటికి మైథిలి సామ్రాజ్యవాదాన్ని, పెట్టుబడిదారీ సంస్కృతిని, అన్నిరకాల అణచివేతలను, వివక్షలను ఎదిరించి బాధితుల వైపు ఉండాలన్న భావజాలం ఒంటపట్టించుకుని వచ్చింది మైథిలి.

చాకిరీని కొన్ని కులాల వారికి పరిమితం చేసివారిని చులకనగా చూసే భారతదేశం నుంచి వెళ్ళిన ఆమెకది అబ్బురంగా అనిపించింది. అమెరికాలో ఉన్న కాలంలో అక్కడి స్నేహితుల మధ్య సహజంగానే ఈ అంశాలన్నీ చర్చకు వచ్చేవి. 1968లో భారతదేశానికి తిరిగి వచ్చేనాటికి మైథిలి సామ్రాజ్యవాదాన్ని, పెట్టుబడిదారీ సంస్కృతిని, అన్నిరకాల అణచివేతలను, వివక్షలను ఎదిరించి బాధితుల వైపు ఉండాలన్న భావజాలం ఒంటపట్టించుకుని వచ్చింది. ఆ పరిధిలోకి వచ్చే అంశాలపై తమిళంలోనూ, ఆంగ్లంలోనూ కూడా సరళంగా, ఆసక్తికరంగా రాయడం ప్రారంభించింది. కిలవన్మేణి దారి చూపింది.

మద్రాస్ (అప్పటికింకా అది మద్రాసే)కి తిరిగివచ్చాక తనలాంటి భావజాలం ఉన్న కొద్దిమందితో (హిందూ దినపత్రిక సంపాదకుడు ఎన్.రామ్ అందులో ఒకరు) రాడికల్ రివ్యూ అనే పత్రికను తీసుకువచ్చింది. దానికి ఆమే సంపాదకురాలు. ప్రపంచ రాజకీయాల నుంచి భారతదేశంలో ఆనాడు సామాజికంగా ముందుకొస్తున్న అంశాల వరకు అనేకం అందులో చర్చించేవారు. వాటిలో అత్యధికం మైథిలి రాసినవే. మద్రాస్‌కి తిరిగివచ్చిన నాలుగైదు నెలల్లోనే జరిగిన ఒక మారణకాండ ఆమెను కుదిపేసింది.

ఉమ్మడి తంజావూరు జిల్లాలో కిలవన్మేణి ఒక గ్రామం. తంజావూరు ప్రాంతంలో హరిత విప్లవం వల్ల కరువుకాటకాల నుంచి బయటపడి పంటలు సమృద్ధిగా పండుతున్నా భూస్వాముల గాదెలు నిండుతున్నాయే తప్ప అవి రెక్కలు ముక్కలు చేసుకుంటున్న దళిత కూలీల నోటివరకూ రావడం లేదు.

**భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్ట్) సీపీఎం నాయకత్వంలో కిలవన్మేణి, చుట్టుపక్కల వాడలకు చెందిన రైతుకూలీలు తమ కూలి పెంపు కోసం సంఘటితమయ్యారు. వాడలలో తమ ఇళ్ళపై ఎర్రజెండాలు ఎగురవేశారు. తమనే ఎదిరించిన వారికి గుణపాఠం చెప్పకపోతే మరింత మంది ఆ దారిలోనే నడుస్తారేమోనని భావించిన భూస్వాములు వారిని తమ**

పొలాల్లో పనికి రావక్కర్లేదన్నారు. బయటి వాళ్లను పిలిస్తే తాము ఒప్పుకోమని, తమకు వేతనాలు పెంచి ఇస్తేనే పంట ఇంటికి చేరుతుందని రైతుకూలీలు హెచ్చరించారు.

తమని ఎదిరించారన్న అహంతో భూస్వాములు 200 మంది అనయాయులను, కిరాయి మందను పోగేసుకుని 1968 డిసెంబర్ 25 రాత్రి కిలవన్మేణి వాడను ఆయుధాలతో చుట్టుముట్టారు. ఎటూ తప్పించుకోవడానికి వీలులేకుండా దిగ్బంధించారు. వాళ్లనెదిరించడానికి చేతిలో రాళ్ళు తప్ప మరేమీ లేని నిస్సహాయస్థితి వాడలోని కూలీలది. దాడిని నిలవరించడానికి ప్రయత్నించిన ఇద్దరినీ కాల్చి చంపారు. పిల్లలు, మహిళలు, కొద్దిమంది వృద్ధులైన పురుషులు ఒక చిన్న గుడిసెలోకి దూరి తమను కాపాడుకునే ప్రయత్నం చేస్తే దానికి నిప్పంటించారు. అది ఆరకుండా ఉండడం కోసం ఎండుగడ్డి, పుల్లలు వేసి ఎగదోశారు. దానిలో నుంచి ఇద్దరు పిల్లలను లోపలి వారు బయటికి విసిరేస్తే (వాళ్లనైనా కాపాడదామని) వాళ్లను తిరిగి నిర్దాక్షిణ్యంగా లోపలికి తోసేశారు. మొత్తం 44 మందిని పొట్టన పెట్టుకున్నారు. పైగా తామే పోలీస్ స్టేషన్‌కివెళ్ళి తమపై ప్రతి దాడులు జరగకుండా వారి నుంచి రక్షణ పొందారు. అత్యంత క్రూరంగా జరిగిన ఈ మారణకాండ మైథిలీ జీవిత గమనాన్నే మార్చేసింది.

ఇది జరిగిన రోజో, మరుసటి రోజో మైథిలి అన్న పెళ్ళి. ఆ పెళ్ళిలో ఉన్నప్పుడు ఎవరో ఫోన్ చేసి ఈ సంగతి చెప్పారామెకు. వెంటనే అక్కడకు వెళ్లే ప్రయత్నాలు మొదలుపెట్టింది. ప్రముఖ గాంధేయురాలు కృష్ణమ్మాళ్ జగన్నాథన్ సహాయం తీసుకుని ఆమె వెంట వారంలోపే కీలవెన్మణికి చేరుకుంది. ఆ మహా ఘోరం మిగిల్చిన ఆనవాళ్ళను, వారి దు:ఖాన్ని చూసి చలించిపోయిన మైథిలి ఆ వివరాలు సేకరించి వీలైనన్ని మార్గాల ద్వారా ప్రపంచానికి తెలియచేసే పనిలో నిమగ్నమైపోయింది. అందుకోసం కీలవెన్మణి, చుట్టుపక్కల దళితవాడలలోని రైతు కూలీలతో మాట్లాడడం కోసం సీపీఎం ద్వారా రైతుకూలీ సంఘం నాయకులను పరిచయం చేసుకుంది. కేవలం కూలీ సమస్య మాత్రమే కాదు, చేతులు కట్టుకుని మా ముందు నిలబడిన వాళ్లు జెండాలు పట్టుకుని వీధుల్లోకి వస్తారా? కూడళ్ళలో జెండా ఎగరేస్తారా? అన్న అహం, తమ పెత్తనం చేజారిపోకూడదన్న కండకావరం వారినీ దారుణానికి పురికొల్పాయని మైథిలి అర్థం చేసుకుంది.

దళితులు రైతు కూలీ సంఘాన్ని పెట్టుకుని, స్వతంత్ర రాజకీయ అస్తిత్వాన్ని ప్రదర్శించడం తట్టుకోలేకపోయారన్నది తెలుసుకుంది. మళ్ళీ ఎర్రజెండా ఎప్పుడు ఎగరేస్తారు, వాడలలో మళ్ళీ ఎర్రజెండా ఎగురుతుందా అని ప్రతి ఒక్కరినీ అడిగేదట. ఇప్పటికిప్పుడు మా ఇంటి పైకప్పులపై ఎగరేయలేకపోయినా మా గుండెలలో రెపరెపలాడుతూనే ఉంటుందని ఆవేదనగా బదులిచ్చేవారట. వారి ఈ ఆవేదనకు తను అక్షరరూపం ఇచ్చి రాడికల్ రివ్యూ, మెయిన్ స్ట్రీమ్, సెమినార్, ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీలాంటి మాగజైన్లకు టైమ్స్ ఆఫ్ ఇండియా, పయనీర్ తదితర వార్తాపత్రికలలో వ్యాసాలు రాసింది.

స్థానిక తమిళ పత్రికలకూ రాసింది. సంఘటనలను వర్ణించడానికే పరిమితం అవ్వకుండా, ఏయే ఆర్థిక, సామాజిక పరిణామాలు ఈ సంఘటన జరగడానికి కారణమయ్యాయో విశదీకరించేది.

**మళ్ళీ ఎర్రజెండా ఎగురుతుందా అని ప్రతి ఒక్కరినీ అడిగేదట. ఇప్పటికిప్పుడు మా ఇంటి పైకప్పులపై ఎగరేయలేకపోయినా మా గుండెలలో రెపరెపలాడుతూనే ఉంటుందని ఆవేదనగా బదులిచ్చేవారట. వారి ఈ ఆవేదనకు తను అక్షరరూపం ఇచ్చి రాడికల్ రివ్యూ, మెయిన్ స్ట్రీమ్, సెమినార్, ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీలాంటి మాగజైన్లకు టైమ్స్ ఆఫ్ ఇండియా, పయనీర్ తదితర వార్తాపత్రికలలో వ్యాసాలు రాసింది.**

**స్థానిక తమిళ పత్రికలకూ రాసింది. సంఘటనలను వరించడానికే పరిమితం అవ్వకుండా, ఏయే ఆర్థిక, సామాజిక పరిణామాలు ఈ సంఘటన జరగడానికి కారణమయ్యాయో విశదీకరించేది.**

కీలవెన్మణి ఘటనలకు మూలం తంజావూరు ప్రాంత వ్యవసాయ వ్యవస్థలలో చోటుచేసుకుంటున్న మార్పులలో ఉందని రాసింది. అందుకు హరిత విప్లవం ఎలా కారణమైందో కూడా విశ్లేషించింది. ఈ నేపథ్యంలో ఆమె రాసిన రంబ్లింగ్స్ ఆఫ్ క్లాస్ స్ట్రగుల్ ఇన్ టాంజోర్ (తంజావూరులో వర్గపోరాట ఘర్జనలు) చాలా ముఖ్యమైనది. ◆

**(తరువాయి భాగం వచ్చే సంచికలో)**

మహిళా హక్కుల నేత సూర్యావతి గారి
శతజయంతి శుభాకాంక్షలతో....

ఫోన్ : 08964 245050

# సూర్యక్రిష్ణ క్లినిక్

మున్సిపల్ ఆఫీసు పక్కన,
కెనరా బ్యాంకు మేడపైన,
జైపూర్ రోడ్డు,
సాలూరు - 535 591.

Consultant:
డా॥ బి. అప్పలనాయుడు
MBBS, MD
(Paediatrics, KG)

డా॥ టి. దాక్షాయణి
MBBS, DGO
గైనకాలజిస్ట్

# లక్ష్మీ హాస్పటల్

సూర్యమహల్ ప్రక్కన, కోటవీధి, సాలూరు

మహిళా హక్కుల నేత సూర్యావతి గారి
శతజయంతి శుభాకాంక్షలతో....

## శ్రీ కారు రామారావు గారు

అటవీ రేంజ్ అధికారి, సాలూరు
మరియు అటవీ సెక్షన్
అధికారులు & సిబ్బంది.



అల్లూరి మన్మోహిని



స్త్రీ జాతికి వెలుగుబాట ఆమె. సామ్యవాద సిద్ధాంతాన్ని ఔపోసన పట్టిన మానవతావాది ఆమె. నిరాడంబరతకు నిలువుటద్దం ఆమె. సాంఘిక దురాచారాల నిర్మూలన కోసం, బాల్య వివాహాల రద్దు కోసం ఐక్యోద్యమాలను నడిపిన ఆదర్శ నాయకురాలు ఆమె. మహిళా సమస్యలపై అలుపెరగని పోరాటాలు చేసి పాలకుల మెడలు వంచి విజయాలందించిన వీర వనిత ఆమె. ఆమే మానికొండ సూర్యావతి గారు. ఆమె శత జయంతి ఉత్సవాల సందర్భంగా 'చైనత్య మానవి' అందిస్తున్న ప్రత్యేక వ్యాసం.

# స్త్రీ జాతికి సూర్యోదయం సూర్యావతి జీవన సమరం

మానికొండ సూర్యావతి, సుబ్బారావుగార్లు ఆది దంపతులుగా సామ్యవాద సిద్ధాంత పటిమతో సామాజిక జీవితం గడపటం కోసం అనుక్షణం పరితపించారు. ఉద్యమించారు, చరితార్థులయ్యారు.

అది 1954 ఏప్రిల్ నెల. విజయవాడలోని ఎస్.ఆర్.ఆర్. అండ్ సివిఆర్ కళాశాల గ్రౌండ్‌లో జరిగిన పెద్ద మహిళా సభలో నేను మొదటిసారిగా మానికొండ సూర్యావతిగారిని చూశాను. నేను పశ్చిమగోదావరి జిల్లా మహిళా ఉద్యమనేత గోకరాజు వెంకాయమ్మగారి సహాయంతో భీమవరం నుండి వచ్చాను. ఆ సభకు మహిళా ఉద్యమ ప్రముఖులు రేణు చక్రవర్తి, హజ్రా బేగంగార్లు ఢిల్లీనుండి వచ్చారు. రేణు చక్రవర్తి పార్లమెంట్ సభ్యులుగా కూడా ఉన్నారు. సూర్యావతిగారి చిన్ననాటి రోజుల్లో స్త్రీలకు అది అంధకారయుగం. మధ్యతరగతి, ఉన్నతవర్గాల స్త్రీలకు తమ విలువలు, తమ హక్కులు అంటే ఏమిటో తెలియని దశ. ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వ వలస పాలనలో బానిసత్వంతో మగ్గిపోయే భారత ప్రజలు దేశ స్వాతంత్ర్యం కోసం మహాత్మాగాంధీ, భగత్‌సింగ్, సుభాష్ చంద్రబోస్, అల్లూరిసీతారామరాజు మొదలైన ఎందరో మహనీయుల నాయకత్వంలో అశేష భారత జాతి స్త్రీ పురుషులు అనే భేదం మరచి చావుబతుకుల పోరాటంగా తిరగబడింది. ఫలితంగా బ్రిటిష్ వలసపాలన అంతరించింది. స్వతంత్ర ఉద్యమం స్త్రీ జాతికి మేల్కొలుపుగా నిద్రాణమైన స్త్రీ శక్తికి వెలుగుబాట అయింది. **స్వతంత్రోద్యమంలో కదిలిన భారత మహిళలు సాంఘిక దురాచారాలు, బాల్యవివాహాల రద్దు కోసం కూడా ఉద్యమించారు. ఫలితంగా కేంద్రప్రభుత్వం శారదా బిల్లు తీసుకువచ్చింది. అనంతరం స్త్రీలకు ఆస్తి హక్కు కోసం అంటే చట్టపరంగా భర్త ఆస్తి భార్యకు చెందే హక్కు కోసం ఉద్యమం ప్రారంభించి ఊరూరా మహిళాసంఘం నిర్మాణం చేశారు. 1942లో కృష్ణా జిల్లా చిలువూరులో జరిగిన మొదటి రాష్ట్ర మహాసభలో మానికొండ సూర్యావతిగారు, కొమర్రాజు అచ్చమాంబగారు అధ్యక్ష కార్యదర్శులుగా ఎన్నికయ్యారు.** బాల్యవివాహాలు, బహుభార్యత్వానికి వ్యతిరేకంగానూ విడాకుల చట్టం కోసం ఆందోళన ప్రారంభించారు. సూర్యావతిగారు ఊరూరా తిరుగుతూ మహిళల్ని చైతన్యపరచుటకు చాలా ఓర్పుతో, నేర్పుతో చిన్న చిన్న గ్రూపు సమావేశాలు జరిపేవారు. మహిళల్ని నిత్యం కలుసుకుంటూ, జీవిత విలువల్ని తెలియజేస్తూ నెమ్మదిగా మహిళా సంఘంలోకి ఆకర్షించడం ఆనాటి సాంఘిక కట్టుబాట్లతో చాలా కష్టంతో కూడుకున్న కార్యక్రమం చేయాల్సి వచ్చేది.

1937 డిసెంబర్ 17వ తేదీన పశ్చిమగోదావరి జిల్లా జిన్నూరు గ్రామంలో ఏర్పడిన మహిళాసంఘం అధ్యక్షురాలు భూపతిరాజు వెంకాయమ్మ గారిని కలుసుకొనుటకు వారి ఇంటికి సూర్యావతిగారు, నాగళ్ళ రాజేశ్వరమ్మగారు కలసి వచ్చారు. 31-12-1938వ సంవత్సరంలో పశ్చిమగోదావరి జిల్లా జిన్నూరు, పాలకొల్లు పక్కనే వున్న లంకలకోడేరు గ్రామంలో మొదటి మహిళా సభ జరిగింది. ఈ సమాచారం సేకరణ

19-02-1938 నవశక్తి పత్రిక నుండి పశ్చిమగోదావరి జిల్లా 2వ మహాసభ, 1943 డిసెంబర్ 24, 25 తేదీలలో నౌడూరులో జరిగింది. దానికి మానికొండ సూర్యావతిగారు హాజరై బహిరంగసభను ప్రారంభించారు. రాజకీయాలకతీతంగా విశాల ప్రాతిపదికపై కొనసాగిన ఆ మహిళా మహాసభలో ఘోషాలు, వెనుకబడిన సాంఘిక కట్టుబాట్లతోవున్న మహిళాలోకంలో పెద్ద సంచలనాన్ని సృష్టించింది. (ఇది నవశక్తి పత్రిక సమాచారం) ఆ సందర్భంలోనే ఇంటినుండి బయటకు రాని మహిళల్ని పాటలుపాడి వారిని ఆకర్షించి ఆహారం, ఆరోగ్య సూత్రాలు బోధిస్తూ ఉత్సాహపరచి ఉద్యమాలలోకి తీసుకువచ్చేవారు. ఆరకంగా సాంఘిక సంస్కరణోద్యమంతో మహిళా ఉద్యమం ప్రారంభమైంది. **భారత పార్లమెంట్‌లో హిందూ కోడ్ బిల్లులు పాస్ చేస్తుంటే ఆ బిల్లులోనే భారత స్త్రీలకు భర్త ఆస్తి భార్యకు చెందే హక్కు బిల్లులో చేర్చాలని మహిళా సంఘం రాష్ట్ర వ్యాపితంగా ఇంటింటికీ తిరిగి లక్ష సంతకాలు సేకరించి, మహిళల సమస్యల పరిశీలనకై ప్రభుత్వం చేసిన బల్వంతరాయ్ కమిషన్ (బి.ఎన్.రాయ్ కమిషన్) పర్యటనకు వచ్చినప్పుడు మెమొరాండం సమర్పించింది.** ఆ కమిషన్ వద్దకు 15 వేల మంది మహిళల్ని సమీకరించడం జరిగింది. ఫలితంగానే భర్త ఆస్థి ఏ సెంటో కుంటో వున్నా భార్యకు చెందే హక్కు లభించింది. అంతకుముందు స్త్రీలకు చట్టపరంగా ఒక మనోవర్తి హక్కు మాత్రమే ఉండేది. భర్త చనిపోతే అతని ఆస్తిలో భార్యకు, ఆడపిల్లలకు ఏ రకమైన హక్కు



ఉండేదికాదు. కొడుకులు లేకపోతే ఆ ఆస్తి అన్నదమ్ములకు చెందేది. ఈనాటి భారత మహిళలందరూ ఆస్తి హక్కు అనుభవిస్తున్నారు. ఇది ప్రభుత్వం తానుగా ఇచ్చిన హక్కు కాదు. **మహిళాసంఘం పోరాడి సాధించిన హక్కు, మహిళాసంఘం తొలివిజయం ఈ ఆస్తి హక్కు. భారత మహిళలకు మహిళాసంఘం ఇచ్చిన గొప్ప వరం ఈ ఆస్తి హక్కు.**

దేశవ్యాపితంగా ప్రజా ఉద్యమాలలో పెడధోరణులు ప్రారంభమైన మూలంగా మహిళా ఉద్యమం చెల్లాచెదురైంది. 1964 డిసెంబర్ 30వ తేదీన ప్రజానాయకులైన1100 మందిని డిటెన్యూలుగా ఇందిరాగాంధీ ప్రభుత్వం అరెస్టు చేసింది. ఆ సందర్భంగా ఇద్దరు చిన్న పిల్లలతో ఇంట్లోవున్న మానికొండ సూర్యావతి, సుబ్బారావు దంపతులు ఇద్దర్నీ కూడా డిటెన్యూలుగా ఒకటిన్నర సంవత్సరం హైదరాబాద్ సెంట్రల్ జైలులో నిర్బంధించారు. ఆ అస్తవ్యస్త పరిస్థితుల్లో మహిళా ఉద్యమం చెల్లా చెదురైంది. తిరిగి పునర్నిర్మాణం చేయడం చాలా కష్టమైంది. అంతటి పరీక్షా సమయంలో పశ్చిమగోదావరి జిల్లా పాలకొల్లు చేనేత కాలనీలో 1960లో దీక్షతో వందమంది మహిళలను సంఘ సభ్యులుగా చేర్పించాం. ఆ వంద మంది మహిళలను సమీకరించాం. ఆ సభకు సూర్యావతి హాజరై మహిళలను ఉత్తేజపరిచారు. అప్పుడు సంఘ సభ్యత్వం 25పైసలు. 1971లో పశ్చిమగోదావరి జల్లాలోని నర్సాపురం దేవా, ములపర్రు గ్రామాల్లో మేం ఏర్పాటు చేసిన మహిళా సంఘం విస్తృత సమావేశాలకూ సూర్యావతిగారు, స్వరాజ్యంగారు హాజరై మహిళా ఉద్యమాన్ని, మహిళలను ఉత్తేజపరిచారు.

సూర్యావతిగారు ఎంతో ఉన్నత కుటుంబంలో అతి గారాభంగా పెరిగారు. వివాహ అనంతరం తల్లి ఒడిలాంటి సోషలిస్టు సమాజ నిర్మాణ కృషిలో సర్వసుఖాలు వదులుకొని నిరంతరం శ్రమించారు. సామాజిక, రాజకీయ స్థితిగతుల ప్రచారానికి ముఖ్య సాధనమైన పత్రికా పఠనం కోసం ఆ నాటి నవశక్తి అభ్యుదయ పత్రికను చేతబట్టి స్వయంగా విజయవాడ బస్టాండులో అమ్మేవారు. ఆ చాంధస కాలంలో బస్టాండులో పత్రికలు అమ్మిన ఆమె చైతన్యం ఎంతటిదో ఊహించుకోవచ్చు. రాయడానికి మాటలు చాలవు. సూర్యావతిగారి పిల్లలు వాణి, రమలతో రేకుల షెడ్డులోనే నివాసముండేవారు.

ఆమె పంచాయతీరాజ్ బాధ్యతలు కూడా స్వీకరించి ఎమ్మెల్సీగా ఉండి కూడా కాలినడకనే ఆమె సంచారం చేసేవారు. విజయవాడ మహాపట్టణంలో సూర్యావతిగారూ, భిక్షావతిగారు కలిసి తిరగని వీధి, అడుగుపెట్టని గడప లేవు. సంఘ సభ్యత్వం కోసం ఉద్యమాల నిర్వహణ కోసం అహర్నిశం శ్రమించి అస్తమించారు. సూర్యావతిగారి జీవితమే ఈ నాటి కార్యకర్తలకు గొప్ప సందేశం. ఆమె వారసత్వం ఈనాటి ప్రజా ఉద్యమాలకు మార్గదర్శనం. 'ఆ మహాతల్లి శతజయంతికి జేజేలు' ◆

# సంస్కరణ కీర్తి తెలుగు ప్రజలది

వీరేశలింగం పంతులుగారు 1911 డిసెంబర్‌లో జ్వర పీడితులయ్యారు. అకస్మాత్తుగా స్పృహతప్పి వెనుకకు పడిపోయారు. ఊపిరిలేదు. నాడి దొరకలేదు. అందరూ ఆయన చనిపోయారని భావించారు. కాని పావుగంట తర్వాత తేరుకున్నారు. కాని అవయవాలు పంతులుగారి స్వాధీనంలో లేవు. వేరొకరి సాయం లేకుండా గడపలేని పరిస్థితి వచ్చింది. ఆ సమయంలో అంతకుముందు పంతులుగారు తమ బిడ్డలా చూసుకొని తనకి బాగా తెలుసున్న వ్యక్తితో వితంతువివాహం చేసిన మంగమ్మ, ఆమె భర్త పంతులుగారికి సేవచేశారు. ఆయనను కంటికి రెప్పలా కాపాడారు. నెమ్మదిగా కొంచెం శక్తి వచ్చి పంతులుగారు కోలుకున్నారు.

రాజ్యలక్ష్మిగారు చనిపోయిన సంవత్సరంలోనే వీరేశలింగంగారు ఆమె సమాధి కట్టించారు. అంతకుముందే చనిపోయిన దేశరాజు బాపయ్యగారి అస్థికలను కూడా పంతులుగారు వారితోటలోనే సమాధి కట్టించారు. హితకారిణి సమాజం నుండి వితంతు శరణాలయానికి ధన సహాయం అంతంత మాత్రంగానే ఉండేది. పంతులుగారు హితకారిణి తరపున తానే పెట్టుబడి పెట్టారు. కాని అది హితకారిణి సమాజంవారు తీర్చలేదు. వారు తీర్చకపోయినా ప్రతినెలా పంతులుగారు హితకారిణి సమాజానికి చందా ఇచ్చేవారు. పంతులుగారు గ్రంథాలు అమ్మడం వలన ఆయన సర్వకళాశాల పరీక్షాధికారిగా ఉన్నందుకై వచ్చిన జీతము వీటన్నింటిని కూడా పంతులుగారు ప్రజాహిత కార్యక్రమాలకై



ఖర్చు చేసేవారు. భార్య చనిపోయిన తర్వాత అనారోగ్యంవలన పంతులుగారు వీటన్నింటిని వదిలేశారు. పంతులుగారి పోషణకు మాత్రం వచ్చే పెన్షనే ఆధారమైంది.

**చివరిదశలో పంతులుగారు ఆంధ్రదేశ ప్రజలకు మరియు ప్రత్యేకంగా రాజమహేంద్రవరం నివాసులకు ఒక విజ్ఞప్తి రాసి దానిపై వారు సంతకం చేశారు. ఇది తన చివరి విన్నపం అనికూడా రాశారు. తనకు ధనము, బలము. అధిక విద్య, అధికారము కలిగిన వారని కాదు అని తెలియజేశారు. కేవలం దేశాభిమానం ఉన్నందువల్ల సాధ్యాసాధ్యాలను లెక్కచేయక సంఘసంస్కరణలకు పూనుకున్నానని, దానికి తనవద్దనున్న ధనము, బలము, వయసు, విద్య, బుద్ధి ధారపోసి మీ అందరి ఆదరాభిమానాలకు పాత్రుడనయ్యానని వెల్లడించారు. మన తెలుగువారు, ఇతరులు నన్ను గౌరవించి గొప్పవానిగా చేయడం జరిగింది. ఆ గొప్పతనం రాజమహేంద్రవరం పురజనులది. రాజమహేంద్రవరం సంస్కరణములకు జన్మభూమిగా పేరుగాంచింది. ఆ పేరు నిలబెట్టవలసిన బాధ్యత ఇప్పుడు రాజమహేంద్రవరం ప్రజలది, సోదరులది అని వృద్ధ సోదరుడైన తాను విజ్ఞప్తి చేస్తున్నానని తెలియజేశారు.** ఈ కీర్తి తెలుగుదేశ మంతటిదీ. రాజమహేంద్రవరం ఒక్క దానిదే కాదు. తాను అరవదేశము, కన్నడ ప్రాంతములలో కూడా ఈ విధంగానే ప్రచారం చేశానని పంతులుగారు చెప్పారు. ఆ ప్రాంతాలలో ప్రచారనిమిత్తంగా తిరిగినప్పుడు సంస్కరణ విషయాలలో వితంతు వివాహాలు, స్త్రీ విద్య యందు తమ ప్రాంతములకంటె తెలుగు ప్రాంతం ముందున్నదని చెప్పుకోవడం తాను విన్నానని, ఆ మాటలు విన్నప్పుడు తాను ఎంతో గర్వంగా భావించానని పంతులుగారు వెల్లడించారు. ఈ సంస్కరణల భారం ఇప్పుడు పూర్తిగా మీరు చేపట్టాలని ప్రజలకు విన్నవించారు. **సమాజంలోని అన్ని రంగాలలోను సంస్కారము, అభివృద్ధి సమానంగా జరగాలనేది పంతులుగారి అభిప్రాయం. ఇంటా బయటా స్త్రీ దాస్యంనుండి బయట పడాలి. రాజ్యాంగ స్వతంత్రము సంపూర్ణంగా స్వతంత్రము పొంది సమాజంలో భ్రష్టుపట్టిపోయి దురాచార భూతమునకు దాసులమైతే లాభమేముంది? కడుపున పుట్టిన బిడ్డల ఇష్టాలకు ప్రాధాన్యమివ్వక పాచిపట్టిన పూర్వాచారాలకు ప్రముఖ స్థానమిచ్చి బాలికలు బాలవితంతువులై దుర్భరజీవితాలను గడుపుతుండగా గృహజీవితము సుఖప్రదమైనదని ఎలా భావించాలని పంతులుగారు ప్రజలను ప్రశ్నించారు.** ◆ (సశేషం)

కె.ఉషారాణి

# కలహాల మారి కరోనా!



మాది 17 అపార్టుమెంట్లున్న చిన్న సమూహం. ఐదు ఫ్లోర్లు, మూడు బ్లాకులు, రెండు పెంట్ హౌస్‌లు. అన్ని ప్లాట్లలోనూ ఉండేది ఒకరిద్దరే. అందులోనూ ఎక్కువ మంది సీనియర్ సిటిజన్లే. అంతా ఒకరికి ఒకరు సహాయ సహకారాలు అందించుకుంటూ పలకరింపులు, పరామర్శలతో సరదా ఉండే ప్లాట్ ఓటనర్లున్న సమూహం మాది. అన్ని ఇళ్లలోనూ గాలి వెలుతురు పుష్కలంగా ఉంటాయి. సూర్యోదయ, సూర్యాస్తమయాలు చూస్తూ వంటింట్లో ఉదయం కాఫీ, సాయంత్రం టీ చేసుకుని తాగుతూ ఉంటాం. మా ప్లాట్ల కార్యవర్గం అంతా మహిళలే. నేను ట్రజరర్‌ని. మాది నాలుగో ఫ్లోర్. అధ్యక్షురాలు మా పక్కింటి కనకదుర్గ. కార్యదర్శి పద్మిని. **ఇంత మంచి వాతావరణంలోకి మాయదారి కరోనా అడుగు పెట్టిందేమోనని అనుమానం కలహాలకు అంకురం వేసింది. మా పాట్లలోకి, మా ఇంట్లోకి మా నట్టింట్లోకి గుట్టుచప్పుడు కాకుండా కరోనా సోకిందేమోననే అనుమానం కలగడానికి నేనే కారణం. కరోనా కలహప్రియ అని అప్పటిదాకా తెలీదు.**

మా ప్లాట్లో ఉండేది నేను మా ఆయన. అప్పటి వరకూ కరోనా రాకుండా ఉండటానికి శానిటైజేషన్, సోషల్ డిస్టెన్సింగ్, మాస్క్ అని, వస్తే ఐసోలేషన్ అని అనుకున్నా. ఐసోలేషన్ అనుభవంలోకి వస్తేగాని దానిసారం నాకు అర్థం కాలేదు.

ఒకరోజు పొద్దున్నే మా ఇంటాయన దగ్గుతున్నాడు. 'ఏమండీ దగ్గుతున్నారు. కాస్త ఆవిరి పట్టండి. గార్లింగ్ చేయండి' అని ఒకటీ రెండు సార్లు చెప్పాను. ఎప్పటిలాగే ఆయన కాస్తంత దగ్గుకి ఎందుకంత వెంటపడతావు అన్నారు. మంచికి చెప్పినా విసుక్కున్నందుకు నొచ్చుకున్నాను.

**ఎప్పటిలాగే పనమ్మాయి ఏడింటికి వచ్చింది. అంట్లు తోముతూ ఆవిరి పట్టమనడం విన్నది. 'అమ్మా అయ్యగారు దగ్గుతున్నారు కదా. టెస్టుకు వెళ్లమనండి ఎందుకైనా మంచిది. రిజల్టు వచ్చాక కబురు పెట్టండి. మీరిచ్చే జీతాలకు జీవితాలు బలిపెట్టలేము కదా. మీకైతే ఎటూ తప్పదు' అంటూ అంట్లు ఆపి** వెళ్లిపోయింది. నాకు నోటమాట రాలేదు. షాకయ్యా. ఆరోజే పదింటికల్లా వచ్చే బట్టలుతికే ఆమె రాలేదు.
ఇంటర్ కామ్‌లో వాచ్‌మెన్‌కు ఫోన్ చేసి అడిగాను. ఆ అమ్మాయి వచ్చి వెళ్లిందని, మా ఆయనకు కరోనా ఉందేమోనని అనుమానంతో మా ఇంటికి రాలేదని వాచ్‌మెన్ చెప్పాడు. వాచ్‌మెన్‌కు పనమ్మాయి చెప్పిందట ఇదంతా. అబ్బా గాలికన్నా వేగంగా వ్యాపిస్తుందే అనుకున్నాను. ఇంతలో ప్లాట్ల కార్యదర్శి ఫోన్. 'మీ వారికి కరోనా అటగా' అంది. 'ఇంకా టెస్టు చేయించలేదండీ. ఏదో ఒకటి రెండుసార్లు దగ్గారంతే. వెళతారు లేండీ' అన్నాను. రోజూ పండ్లు తెచ్చే అమ్మాయి ఇంటి ముందు నుంచి ముఖమంతా చీరతో కప్పుకొని పక్కింటికి వెళ్లింది. పూలిచ్చే అమ్మాయి కూడా అంతే. కొరియర్ డెలివరీ బాయ్ వాచ్‌మెన్‌కు ఇచ్చి వెళ్లిపోయాడు. పేపర్ వాడూ అంతే.

మాది మధ్య ప్లాటు. ఇటువాళ్ల, అటువాళ్లు ఫోన్లు. 'విజయ ఎందుకైనా మంచిది. మీ వారిని ఆస్పత్రిలో చేర్పించు. మీకే కాదు మాకు కూడా ఇబ్బందే. నీకు మాత్రం వయస్సు తక్కువ ఉందా. ఈ వయస్సులో రిస్కు అవసరమా. డబ్బుకు వెనుకాడకు' అని సలహాలిచ్చారు.
**ఇంతలో వనజా కాల్. 'విజయ కరోనా అంటే భయపడకు. మా ఫ్రెండ్‌కు తెలిసిన ఆస్పత్రి ఉంది. కరోనా ఐసోలేషన్ కోసం పెట్టింది. డబ్బు గురించి ఆలోచించకు. తెలిసిన ఆయనే. తగ్గించి చార్జి చేస్తాడు. మీ వారు మేం వద్దన్నా వినకుండా సమాజ సేవ అని బయట తిరిగాడు. ఇప్పుడు మీ వల్ల మాకు రిస్కు. ఆస్పత్రిలో చేర్చడానికి అశ్రద్ధ చేయకు'** అని సలహా ఇచ్చి పెట్టేసింది. నాకు కోసం తారాస్థాయికి →

చేరింది. కానీ ఎవరిమీద కక్కాలి. ఎదురుగుండా ఉన్న ఆయన్నే వాయించాను. వెంటనే టెస్టుకు వెళ్లకపోతే నిరాహార దీక్ష చేస్తానని బెదిరించాను. నాకు జలుబు లేదు. జ్వరం లేదు. టెస్టులు చేయరేమోనని ఆయన అన్నా నేను వినలేదు. విధిలేక ఆధార్ కార్డు తీసుకొని బయలుదేరాడు. ఆ రోజు రిజిస్టర్ చేయించుకున్నారు. టెస్టుకు మరునాడు రామ్మన్నారు. మళ్లీ ఉదయాన్నే బయలు దేరాడు. ఈయన లిఫ్టులో ఎక్కగానే అందులోని వారంతా దిగిపోయారట.

**రోజూ పలకరించే రెండో ఫ్లోర్‌లో ఉండే తాతగారు ఆరడుగల దూరం జరిగి ముఖం తిప్పుకున్నారట. వాచ్‌మెన్ కూడా ఆయన్ని చూసిన వెంటనే ముఖానికి ఉన్న మాస్కుని సర్దుకున్నాడట. మధ్యాహ్నం మూడింటికి వచ్చాడు. టెస్టు చేసే వ్యాన్ రావడం ఆలస్యం అయిందట. టెస్టు మాత్రం అయింది. రిజల్టు ఫోన్‌కే వస్తుంట. హమ్మయ్యా.. అనుకున్నాను. ఎందుకైనా మంచిదని ఆయన్ను ఐసోలేషన్‌లో పెట్టాను.** ఆ ఏర్పాట్లన్నీ నేనే చేశాను. జ్వరం చూసేందుకు థర్మామీటర్, పల్స్ ఆక్సీమీటర్, వేపరేజర్, నీరసం రాకుండా డ్రై ఫ్రూట్స్, ఎనర్జీ డ్రింక్స్ అన్నీ గదిలో పెట్టారు. తిన్నవీ, తాగినవీ కడిగేందుకు రిన్ సబ్బు. బట్టలు ఉతకడానికి సర్ఫు పాకెట్ బాత్‌రూంలో పెట్టాను. నాకు జ్వరం లేదు. జలుబులేదు. ఈ ఏర్పాట్లు ఏమిటి అన్నాడు. కానీ సర్దుకున్నాడు. భోజనం గది బయటే పెట్టి తీసుకోమన్నాను. ఐదింటికి అల్లం, పసుపుతో మరిగించిన వేడినీళ్లు, ఆరింటికి వేడిపాలలో మిరియాలు వేసి ఏడింటికి టీ, ఎనిమిదింటికి భోజనం, తొమ్మిదింటికి వేడినీళ్లు అందించి హమ్మయ్యా.. ఈ రోజుకు గడిచింది అనుకున్నా. ఇన్ని ఏర్పాట్లు చేసి అన్నీ గదిలోకి అందించడంతో నాకు కాళ్లు నొప్పులు మొదలయ్యాయి.

తెల్లవారి ముందు పనిమనిషి పని, తరువాత బట్టలు ఉతికే పని ముగించా. డస్టుబిన్ క్లియర్ చేయడం కూడా నేనే. 'విజయా ఇంకా కాఫీ చేయలేదా' గదిలో నుంచి అరుపులు.

కాఫీ ఇచ్చి కూరలకు అని బయలుదేరాను. మాస్కు వేసుకుని నేను వెళుతుంటే అందరి చూపుల్లో ఆందోళన, అసహనం. ఇన్నేళ్ల తరువాత జీవితంలో అంటరానివారు ఎటువంటి బాధకు గురవుతారో కరోనా వల్ల అదీ అనుభవించాను. భయం.. భయం.. ప్రాణం కదా పోతే తెచ్చుకోలేమని భయం. పోకుండా కాపాడుకోవడానికి ఆస్పత్రులకు చెల్లించాల్సిన మూల్యమంటే భయం. ఆసరా లేకుండా పోతుందని భయం. సమూహంలో ఒంటరితనం. చుట్టూ అనుమానపు నీడలు. గోడలు. మనిషికి బలం సమూహమే. కానీ కరోనా ఆ బలాన్ని భయపెట్టింది. మనిషిని ఒంటరిని చేసింది. నెమ్మదిగా పని ముగించుకుని ఇంటికి చేరాను.

తెల్లవారింది. కరోనా సెంటర్ నుంచి ఫోన్‌కు ఏ సందేశం రాలేదు. 'అక్కా బావగారు ఎలా ఉన్నారు? వదినా అన్నయ్యగారు బాగున్నారా? అమ్మాయి జాగ్రత్త ఆరోగ్యం అశ్రద్ధ చేయకు. అల్లుడికి బాగోలేదట కదా.. జాగ్రత్త. మేమందరం ఉన్నా ఏమీ చేయలేని పరిస్థితి. నువ్వే జాగ్రత్తగ చూసుకోవాలి మరి' అని అమ్మ ఆందోళన. బంధువుల హెచ్చరికలు. ఆస్పత్రిలో చేర్చమని సలహాలు. ఇంతకీ రిజల్టు రానీ, వచ్చాక ఫోన్ చేస్తానని చెప్పా అందరికీ. ఈయన స్నేహితుడి కనకారావు తీసుకోవాల్సిన జాగ్రత్తలు చెప్పాడు. మరోక స్నేహితుడు ఆయుర్వేదం, అల్లోపతి మందుల గురించి చెప్పాడు. అవంతి ధైర్యం చెప్పింది. ఆరోజు కూడా కొవిడ్ కేంద్రం నుంచి సమాచారం రాలేదు.

**ఐసోలేషన్‌లో ఉండే ఆయనకు విసుగు మరింత పెరిగింది. ఎంత సేపు అని పేపరు చదవను అంటూ నస. వంటలు బాగోలేవట. కాఫీ వేడిలేదు. టీ చల్లారిపోయింది అంటున్నాడు. తిన్న కంచాలు నేనే కడగాలి. బట్టలు ఉతికిస్తున్నావు. నామీద కసి తీర్చుకుంటున్నావు కాబోలు అంటూ అరుపులు. కనీసం టీవీ చూడనివ్వు. మొబైల్ చార్జర్ పని చేయడం లేదు ఇంకోకటి కొను... ఇలా మూడో రోజు కూడా గడిచింది.**

ఆ రోజు నాక్కూడా జ్వరం వచ్చిందని అనిపించేంతగా పనితో ఒళ్లు హూనమైంది. మరునాడు నిద్రపట్టిందా అని పలకరించాను. జ్వరం వచ్చిందా అని అడిగే ధైర్యం లేక. 'అన్నీ బాగానే ఉన్నాయి. కాఫీ తగలెయ్' అన్నాడు. పాపం పొద్దున్నే చిరాకు వచ్చేసిందే అనుకున్నా. నిజమేలే మూడు రోజులు వంటరిగా గదిలో బంధిస్తే శిక్షే కదా. **ఈ రోజు కూడా రిజల్టు రాకుండా ఎందుకు ఉంటుంది. కరోనా సెంటర్‌కు ఫోన్ చేయండి అని చెప్పా. వెంటనే ఫోన్ చేశాడు. 'మీరు మరునాడు పాజిటివ్ అని రాకపోతే నెగిటివ్ అనే లెక్కండీ. నెగిటివ్ వాళ్లకు నెమ్మదిగా రిజల్టు పంపిస్తాం. కరోనా సేవా కేంద్రం బిజీ. ఎస్‌ఎంఎస్‌లు పంపే స్టాఫ్ సెలవు. టెస్టు చేసిన నమూనాలను పరీక్షించే టెక్నీషియన్ తండ్రికి కరోనా. అందుకని అతను రాలేదు. అందువల్లే రిజల్టు ఆలస్యమైంది.'** హమ్మయ్యా.. ఎలాగోలా రిజల్టు తెలుసుకున్నాం. మా సంతోషానికి హద్దులేవు. మాయదారి కరోనా ఎంతగా భయపెట్టింది. ఎంత మంది మీద కోపం తెప్పించింది. సహాయ నిరాకరణ చేసిన వారందరినీ కడిగేయాలనిపిస్తోంది. ఆపదలో ఉన్న వాడిని ఆదుకునే మానవ ధర్మాన్ని కరోనా కాటేసింది. కంటికి కనిపించని కరోనా బంధాలు, అనుబంధాలు కనిపించేటట్లు చేసింది. మొత్తానికి కలహాల మారి కరోనా మా ఇంట అడుగు పెట్టనందుకు మేం పండగ చేసుకున్నాం. ఆ పండగ కూడా మేమిద్దరమే కదా చేసుకుంది. ◆

# పోరాటమే ఊపిరిగా..




ఢిల్లీలోని జె.ఎన్.యు. విద్యార్థినులు దేవాంగనా కలితా, నటాషా నర్వాల్ మరియు ఢిల్లీలోని జామియా మిలియా ఇస్లామియా కాలేజికి చెందిన విద్యార్థి అసిఫా ఇక్బాల్ తన్హా ను 2020 సం॥లో యు.ఎ.పి.ఎ.(అన్ లా ఫుల్ యాక్టివిటీస్ ప్రివెన్షన్ యాక్ట్) చట్టం కింద ఢిల్లీ పోలీసులు అరెస్టు చేశారు.

పౌరసత్వ చట్టానికి (సి.ఎ.ఎ) వ్యతిరేకంగా 2019 సం॥నుండి దేశవ్యాప్తంగా ఉధృతంగా ఆందోళనలు, ఉద్యమాలు జరుగుతూ ఉన్నాయి. ఢిల్లీలో జరుగుతున్న అనేక ఆందోళనా కార్యక్రమాలలో దేవాంగనా కలితా, నటాషా నర్వాల్ మరియు అసిఫా ఇక్బాల్ తన్హా చాలా చురుకుగా పాల్గొనటమే కాకుండా ప్రజా వ్యతిరేకమైన పౌరసత్వ చట్టానికి వ్యతిరేకంగా విస్తృతంగా ప్రజలను భాగస్వాములను చేస్తూ ఉన్నారు. ఇది సహించని భారత ప్రభుత్వం కేంద్రం ఆధీనంలోవున్న ఢిల్లీ పోలీసుల ద్వారా వీరిని "ఉపా" చట్టం క్రింద అరెస్టు చేసింది. 2020 ఫిబ్రవరిలో జరిగిన అల్లర్లలో 53 మంది పౌరులు చనిపోయారు. ఈ అల్లర్లకు ప్రేరేపితులుగా ఢిల్లీ పోలీసులు దేవాంగనా కలితా, నటాషా నర్వాల్ మరియు అసిఫా ఇక్బాల్ తన్హాలను పేర్కొంటూ ఉపా చట్టం క్రింద అరెస్టు చేశారు. ఈ దమనకాండలో చనిపోయిన వారందరూ పౌరసత్వ చట్టానికి వ్యతిరేకంగా తమ నిరసనను తెలుపుతున్న వారే. ఈ దమనకాండ సాగించినదెవరో వీడియోలలో స్పష్టంగా రికార్డు అయినా వారిని వదిలేసి ఢిల్లీ పోలీసులు కలితా, ఈ ముగ్గురిని అరెస్టు చేశారు. ◆

## విద్యార్థుల నేపథ్యం..

**దేవాంగనా కలిత :** ముప్పై సంవత్సరాల దేవాంగనా కలిత ఢిల్లీలోని జె.ఎన్.యు.లో మాస్టర్స్ డిగ్రీ కోర్సులో చేరారు. 2015 సం॥ నుండి "పింజ్రా టోడ్" అనే సంస్థతో కలిసి ఢిల్లీలోనూ మరియు దేశంలోని ఇతర ముఖ్య యూనివర్శిటీలు, కాలేజీలు, హాస్టళ్ళు మరియు పేయింగ్ గెస్ట్ రూముల్లోను మహిళా విద్యార్థినులు, మహిళలపై జరిగే లైంగిక దాడులకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు.

**నటాషా అర్వాల్**

నటాషా తండ్రి మహవీర్ విశ్రాంత వ్యవసాయ శాస్త్రవేత్త. అంతే కాకుండా సి.పి.ఎం. సీనియర్ కార్యకర్త కూడా. తన చిన్నతనంలోనే నటాషా తల్లిగారు చనిపోతే తండ్రి మహవీర్ తనను చూసుకున్నారు. పౌర ఉద్యమాలలో నిరంతరం చురుకుగా ఉండే తన తండ్రే తనకు ప్రేరణ అంటారు నటాషా. నటాషా కూడా "పింజ్రా టోడ్" సంస్థలో భాగస్వామురాలు. పౌరసత్వ చట్టానికి వ్యతిరేకంగా తన గళాన్ని బలంగా వినిపిస్తున్నారు. నటాషా తీహార్ జైలులో ఉండగానే కరోనా వల్ల తన తండ్రి మహవీర్‌ను కోల్పోయారు.

**అసిఫా ఇక్బాల్ తన్హా:** కాశ్మీర్‌కు చెందిన అసిఫా. తన ఐదో ఏట స్కూల్‌లో చేరినప్పటినుండే పాకిస్తానీ అనే ముద్రతో నిరాదరణకు గురి కాబడ్డారు. తండ్రి కేంద్రప్రభుత్వ ఉద్యోగి కావడంతో ఢిల్లీకి బదిలీపై వచ్చిన ఢిల్లీలోనే స్థిరపడిన కుటుంబం. జామియా మిలియా ఇస్లామియా కాలేజీలో పి.జి కోర్సు చదువుతున్న అసిఫా జామియా కో ఆర్డినేషన్ కమిటీలో చాలా చురుకైన పాత్ర పోషిస్తూ పౌరసత్వ చట్టానికి వ్యతిరేకంగా ఢిల్లీలో జరుగుతున్న ఆందోళనల్లో పాల్గొంటున్నారు.

సంవత్సరం తరువాత ఢిల్లీ హైకోర్టు ఉగ్రవాద కార్యకలాపాలకు, నిరసన తెలిపే ప్రజాస్వామిక హక్కుకూ మధ్యనున్న రేఖను చెరిపేయడం మంచిది కాదని ఢిల్లీ పోలీసులను హెచ్చరిస్తూ దేవాంగనా కలిత, నటాషా నర్వాల్ మరియు అసిఫా ఇక్బాల్ తన్హాలను కోర్టు విడుదల చేసింది. విడుదలైన సందర్భంలో "ఇది ఇక్కడితో ముగిసిపోయిందని అనుకోవడం లేదని, మామీద తిరిగి తప్పుడు కేసులు పెట్టవచ్చునని, కాని మా లక్ష్యం, మా ఉద్యమించే తత్వం మాత్రం స్థిరంగా ఉంటాయని దేవాంగనా, నర్వాల్ మరియు ఇక్బాల్ తన్హాలు పునరుద్ఘాటించారు. ప్రజల కోసం పోరాటాలే ఊపిరిగా పోరాడుతున్న యువతను కాపాడుకోవలసిన అవసరం ఇప్పుడు మనందరిదీ.

ఎస్.పుణ్యవతి

# ఉత్తేజ తరంగం సూర్యావతి



'మానికొండ సూర్యావతి గురించి వచ్చిన స్త్రీలందరూ గొప్పగా మాట్లాడుకుంటున్నారు. ఇరవైయేళ్లయినా నిండాయో, లేదో రాష్ట్ర పార్టీ ఆర్గనైజర్‌గా వచ్చింది. బక్కపల్చగా వుండి ఎండనక, ధూళనక తిండి, నిద్ర లెక్కచేయక పనిచేసింది సూర్యావతి' అప్పటి కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ పి.సి.జోషి 1944లో రాసిన వాక్యాలివి. విజయవాడలో జరిగిన అఖిలభారత కిసాన్ సభలో పాల్గొనడానికి వచ్చిన పి.సి. జోషి ఆ సభలకు జరిగిన ఏర్పాట్లను, అపూర్వ ప్రజాదరణను చూసి ఉత్తేజితులయ్యారు. తిరిగి వెళ్ళిన తరువాత పార్టీ పత్రికలో వ్యాసం రాశారు. అందులో సూర్యావతి గురించిన ప్రస్తావన ఆమె ప్రత్యేకతను తెలియజేస్తుంది అని అంటూ కామ్రేడ్ లావు బాలగంగాధరరావుగారు ఆమె మరణానంతరం రాసిన వ్యాసంలో పై వాక్యాలు ప్రస్తావించారు.

ఆ తరం వారందరికీ తెలిసిన గొప్ప కమ్యూనిస్టు మహిళ మానికొండ సూర్యావతి. ఈ సంవత్సరం 2021 ఆమె శత జయంతి సంవత్సరం. ఈ సందర్భంగా ఆమెను స్మరించుకోవడం, ఆనాటి సాంఘిక పరిస్థితుల్ని, ఆమె కృషిని తెలుసుకోవడం ఇప్పటి నాయకులు, కార్యకర్తలకు అవసరం.

మానికొండ సూర్యావతి కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా ఇందుపల్లిలో జన్మించారు. తల్లిదండ్రులు కోగంటి భ్రమరాంబ, పున్నయ్య గార్లు. పెంచింది కాటూరులోని పినతల్లి, పిన తండ్రి కడియాల రాజరత్నం, గోపాలరావుగార్లు.

**గోపాలరావుగారు స్వాతంత్ర్య సమరయోధులు, సోషలిస్టు. అభ్యుదయ భావాలు కలవారు. స్త్రీలకు సమాన హక్కులు కావాలని, యువత చైతన్యవంతులు కావాలని, సమాజం బాగు కోసం శ్రమించాలని కోరేవారు. ఆయన స్వగ్రామం కాటూరు కేంద్రంగా యువజన మహిళా సంఘాలు నిర్మించారు. అలా తమ దగ్గర పెరుగుతున్న సూర్యావతికి తర్ఫీదునిచ్చి మూఢవిశ్వాసాల్లో కూరుకుపోయివున్న మహిళల్లో చైతన్య జ్వాల రగిలించడానికి ప్రోత్సహించారు. స్త్రీలను ప్రోత్సహించి స్త్రీల సంఘాలు ఏర్పాటుచేశారు. అతి బాల్యవివాహాలు, బాలవితంతువులు, అతి చిన్న వయసులో గర్భం దాల్చడం, బాలింతల శిశుమరణాలు అత్యధికం. ఈ సమస్యలపై ఆనాడు మహిళాసంఘం ఊరూరా సంఘాలు పెట్టి పోరాడింది.**

"1936లో తూర్పు కృష్ణా మహిళాసంఘం ఏర్పడింది. 56మంది సభ్యులు మాత్రమే ఉన్నారు. తరువాత నెమ్మదిగా విస్తరించి 1938 ఏప్రిల్ 20, 21 తేదీలలో రెండవ మహాసభ జరిగింది. వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ అధ్యక్షురాలుగా, చంద్ర సావిత్రీదేవి కార్యదర్శిగా ఎన్నియ్యారు. 41 జనవరిలో విజయవాడ తాలూకా గరికపర్రులో కృష్ణా జిల్లా ప్రథమ మహాసభ జరుపుకున్నాం. వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ అధ్యక్షురాలుగా, మానికొండ సూర్యావతి కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ప్రతి పదిగ్రామాలకు ఒక ఆసుపత్రి కట్టించాలని, స్త్రీలకు విద్య నేర్పాలని, పురుషులతోపాటు స్త్రీలకు సమాన వేతనం ఇవ్వాలని, ఆస్థిహక్కు ఇవ్వాలని, గ్రామాలలో స్త్రీలకు మరుగుదొడ్లు కట్టించాలని తీర్మానాలు చేసి బ్రిటిష్ ప్రభుత్వానికి పంపించాము" అంటూ సూర్యావతిగారు తన అనుభవాలను ఒక వ్యాసంలో పేర్కొన్నారు.

1947 ఫిబ్రవరి మాసంలో గుంటూరుజిల్లా చిలువూరులో ప్రథమ మహాసభ జరిగింది. డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ అధ్యక్షురాలుగా, మానికొండ సూర్యావతి కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఆవిధంగా ఆంధ్ర రాష్ట్ర మహిళా సంఘానికి ప్రథమ కార్యదర్శి మానికొండ సూర్యావతి. **అరెస్టులు, జైళ్ళు, నిర్బంధాలు ఇవేవీ సూర్యావతి సంకల్ప బలాన్ని నీరుగార్చలేదు. 1948లో విజయవాడలో 2వ మహాసభ జరపాలని సంకల్పిస్తే పోలీసు అనుమతి ఇవ్వలేదు. 144 సెక్షన్ పెట్టారు. నిషేధాజ్ఞలు ధిక్కరించి ప్రదర్శన జరిపితే 70మంది స్త్రీలను అరెస్టు చేసి నందిగామ జైలులో పెట్టారు. సూర్యావతిని రాయవెల్లూరు జైలులో నిర్బంధించారు.**

**"మేము వెళ్ళిన 15 రోజులకు సూర్యావతిగారు వచ్చారు. వస్తూనే** →

**బయటనున్న కామ్రేడ్స్‌తో ఎలా సంబంధాలు పెట్టుకోవాలనే ఆలోచన తీసుకువచ్చారు.** మాకు నెలకు 10 రూపాయలు సాదరు ఖర్చులకోసం గవర్నమెంట్ ఇచ్చేది. పొదుపుచేసి ఆ డబ్బుతో జైలువాళ్ళతోనే గొడుగులు, బ్యాటరీ లైట్లు వంటివి తెప్పించుకొని ఇంటర్వ్యూలకు వచ్చిన కామ్రేడ్స్‌తో బయట అజ్ఞాతంలో వున్న కామ్రేడ్స్‌కు పంపేవాళ్ళం" అంటూ అన్నే అనసూయగారు సూర్యావతిగారితో జైలులో వున్న అనుభవాలను ఒక వ్యాసంలో పంచుకున్నారు. ఇది ఆమె నిబద్ధతకు నిదర్శనం.

తోటి నాయకులను, కార్యకర్తలను ప్రోత్సహించడంలో, చేసిన పొరపాట్లను చిన్నవైనాగాని సున్నితంగా మందలించి సరిదిద్దడం, చిన్న చిన్న విషయాలలో కూడా తర్ఫీదునివ్వడంలో సూర్యావతిగారిని ప్రత్యేకించి చెప్పుకోవాలి.

**సుదీర్ఘకాల రాజకీయ జీవితంలో ఆమె అనేక బాధ్యతలు భుజాన వేసుకున్నారు. మహిళా సంఘం నాయకురాలిగా, కమ్యూనిస్టు నేతగా, శాసనసభ్యురాలిగా, మండలాధ్యక్షురాలిగా బహుముఖాలుగా పనిచేశారు. కుటుంబ బాధ్యత అదనంగా ఉండనే వుంది. తన యావదాస్తిని ఉద్యమ అవసరాల కోసం విరాళంగా ఇచ్చిన మొదటి మహిళ మానికొండ సూర్యావతి.**

1936 నుండి సుమారు 15 సంవత్సరాల వయసునుండి 1993 జూలై 4న చనిపోయేవరకు అరెస్టులు, జైళ్ళు, నిర్బంధాలు ఎన్ని వచ్చినా తట్టుకొని ప్రజలకోసం జీవితాన్ని అర్పించిన మహి ళా నేత సూర్యావతి. ఆమె జీవితం అంద రికీ ఆదర్శప్రాయం, అనుసరణీయం. ◆

# సవాళ్లను ఎదురొడ్డిన వీణాజార్జి



మొదటి నుంచి క్లిష్టమైన అసైన్‌మెంట్‌లు మాత్రమే ఎంచుకునే వ్యక్తి వీణాజార్జి. సవాళ్లను ఎదురొడ్డి పోరాడటమే ఆమె నైజం. అదే ఇప్పుడామెను కేరళ ఆరోగ్య శాఖా మంత్రి పదవి వరించేందుకు కారణమైంది. నువ్వీ పని చేయలగవో లేదో ఆలోచించుకో ఒకసారి. లేదా ఎవరి సహాయమైనా తీసుకో అని తన సీనియర్లు చెప్పిన సలహాలను ఆమె ఎప్పుడూ లెక్కచేయలేదు. నిఫా వైరస్ కట్టడి చేయడంలోనూ, కొవిడ్‌ను నివారించడంలోనూ కేరళ ప్రభుత్వం అనుసరించిన పద్ధతులు దేశానికి దిశా నిర్దేశనం చేశాయి. ముఖ్యంగా కేరళ ఆరోగ్య శాఖా మంత్రిగా పని చేసిన శైలజను ప్రపంచం మొత్తం ప్రశంసించింది. ఎన్నికల అనంతరం ఈ ఆరోగ్య శాఖను వీణాజార్జికి అప్పగించింది. ఈమె కూడా తన కెరీర్ ఉపాధ్యాయినిగానే మొదలు పెట్టింది. ఈమె స్వస్థలం తిరువనంతపురం. తండ్రి న్యాయవాది. తల్లి మున్సిపల్ కౌన్సిలర్. ఎంఎస్‌సి ఫిజిక్స్, బిఇడి చేసిన ఈమె విద్యార్థిగానే ఎస్‌ఎఫ్ఐ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనేది. ఒక అధ్యాపకురాలిగా కంటే సమస్యలపై పోరాడి పరిష్కారం చూపే విలేకరిగా మారడంలో ఆమె ఆనందాన్ని వెతుక్కున్నారు. జర్నలిజం ఆమె అనుకున్నంత తేలికగా సాగలేదు. అప్పుడే నువ్వీ పని చేయలేవు. ఆడపిల్లవు. ఎవరైనా అబ్బాయి సహాయం తీసుకో అనే సలహాలు ఆమెకు వినిపించేవి. కానీ ఈమె తనేంటో నిరూపించుకునేందుకు కైరళీ టీవీ, మనోరమ వంటి ఛానల్స్‌లో పని చేశారు. 2012లో అమెరికా ఎన్నికలు కవర్ చేయడానికి మన దేశం నుంచి వెళ్లిన ఐదుగురు జర్నలిస్టుల్లో ఈమె ఒకరు. నార్త్ అమెరికన్ ప్రెసిడెంట్ క్లబ్ అవార్డు యూఏఈ గ్రీన్ ఛానల్‌కు ఎగ్జిక్యూటివ్ ఎడిటర్ హోదా ఆమెకు దక్కాయి. ఇంతవరకూ ఏ మహిళా ఇంతటి స్థానానికి చేరుకోలేదు. అందుకే ఆమె ఏ పనైనా సాధించడం కష్టం అవుతుందేమో గానీ అసాధ్యం మాత్రం కాదని అంటుందీమె. ఈమె శివదాసన్‌పై అధిక మెజార్టీతో గెలుపొంది ఆరోగ్యశాఖా మంత్రిగా బాధ్యతలు చేపట్టారు.

# మేకలు అమ్మి విరాళం!

సాయం చేసే మనసుంటే మన దగ్గర ఏమీ లేకపోయినా దానం చేయొచ్చని నిరూపించింది కేరళలోని 60 ఏళ్ల వృద్ధురాలు సుబేద. ఈమె కొల్లాంలో టీకొట్టు నడుపుతోంది. కొవిడ్ వ్యాప్తి నేపథ్యంలో ప్రజలను ఆదుకునేందుకు తన వంతుగా ఎంతో కొంత సహాయం చేయాలనుకుంది. ఆ సమయంలోనే కేరళ ముఖ్యమంత్రి విజయన్ కేరళ ప్రజలను ఆదుకునేందుకు విరాళాలు పంపాలని ప్రజలను కోరారు. సుబేదా వెంటనే తన దగ్గరున్న రెండు మేకలను అమ్మి వచ్చిన రూ.55110ను కలెక్టర్‌కు పంపింది. అంతేకాదు లాక్‌డౌన్ ముగిసి టీ కొట్టు తెరిచాక వచ్చిన సంపాదనలో మరికొంత భాగం సీఎంకు అందిస్తానంటోంది. గతంలో బీడీ కర్మాగారంలో పని చేసే ఒక కార్మికుడు తనకున్న బ్యాంకు బ్యాలెన్స్ మొత్తం కొవిడ్ సహాయ నిధికి ఇచ్చేశారు. వీరందరినీ విజయన్ తన ప్రమాణ స్వీకారానికి ముందు వరుసలో ఆహ్వానించారు.

# స్త్రీలు-ఎంపిక!



ఆ కాలంలో చోపెన్‌హర్ అనే తత్వవేత్త స్త్రీలపై ఈ కింది అభిప్రాయాన్ని వెల్లడించారు. 'మహిళను గొప్ప పనులు చేయమని ఎవరూ అడగరు. ఆమె లక్షణం పని చేయడం కాదు. **కష్టాలు పడటం, ప్రసవ వేదన, పిల్లలకు భర్తకు సేవ చేయడం వల్ల ఆమె తన పుట్టుకకు రుణం తీర్చుకుంటుంది. మహోన్నతమైన తెలివితేటలు, అవగాహనా శక్తి ఆమెలో ఉండవు. ఆమె జీవితం ప్రశాంతంగా మగవాడి జీవితంతో పోలిస్తే ఎటువంటి ప్రత్యేకత లేకుండా ఉండాలి. స్త్రీకి పిల్లల్ని పెంచే బాధ్యత, వారికి విద్యా బుద్ధులు నేర్పే బాధ్యత అప్పగించడానికి కారణం ఆమెలో ఉన్న చిన్నతనమే. ఎంత ఎదిగినా ఆమె చిన్నపిల్లగానే ఉండిపోతుంది. ఆడపిల్లల్ని** గృహిణులుగానూ, చెప్పినమాట వినే భార్యగానూ పెంచాలిగానీ వాళ్లకు విద్యా బుద్ధులు నేర్పడం సాధ్యంకాదు. లాంబ్రోసో ఫెరెరో 'ఉమెన్ యాజ్ ఏ క్రిమినల్ అండ్ ప్రాస్టిట్యూట్' అనే పుస్తకంలో ఇదే ధోరణిలో రాశారు. కానీ ఆశ్చర్యం ఏమంటే ఈ పుస్తకంలో ఎంతో నమ్మదగిన సమాచారం అంతా ఒక స్త్రీ అందించింది. వీరంతా సామాజిక పరిస్థితుల, సామాజిక అభివృద్ధి దాని ప్రభావాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేశారు. ఈ తత్వవేత్తల్లానే ఈ పుస్తకం రాసిన రచయితలు కూడా మహిళను అబద్ధానికి ప్రతిరూపం అన్నారు. నిర్ణయాలు తీసుకోవడంలో బలహీనురాలన్నారు. ప్రేమ విషయంలో చపలచిత్తురాలన్నారు. సాహసకార్యాలు చేసే సామర్థ్యం స్త్రీకి లేదన్నారు. స్త్రీని కట్టిపడేసేవి అనురాగం, లొంగుబాటు అనే భావాలు. ఇవి అనుకూలంగా ఉండటం, అలవాటు అవడం ద్వారా వచ్చేగుణాలు. కానీ అవి ఎలా వచ్చాయన్నది రచయితలు చెప్పలేదు. అసలు పరిశీలించలేదు. అలా పరిశీలిస్తే వేల సంవత్సరాలుగా స్త్రీకి సమాజంలో దక్కిన స్థానాన్ని పరీక్షించి ఈనాడు ఈ స్థితిలో ఉండేందుకు దోహదపడిన కారణాలను పరిశీలించాల్సి ఉంటుంది. రకరకాల నాగరికతలు అభివృద్ధి చెందినప్పుడు విభిన్న దేశాల్లో స్త్రీ బానిసగా పురుషుడిపై ఎలా ఆధారపడి బతికిందో ఈ రచయితలు వివరించారు. సామాజిక, ఆర్థిక కారణాలు అసలు పట్టించుకోలేదు. నిజానికి అవే స్త్రీల శారీరక, మానసిక వికాసంపై ఎక్కువ ప్రభావం చూపాయి. ఈ రచయితలు స్త్రీల పట్ల నిరాదరణను చూపారు. **ఎంతోమంది మానవ విజ్ఞాన శాస్త్రవేత్తలు వైద్యులు కూడా స్త్రీని సంఘజీవిగా గాక లైంగిక ప్రాణిగానే చూశారు. స్త్రీ తనను తాను సమర్పించుకోవడానికి మన ఆచారాలు నిషేధిస్తాయి. ఎవరైనా ఆమెను ఎంచుకునేటట్టుగా ఉండాలే గానీ ఆమె ఎవరినీ ఎంచుకోకూడదు. ఒకవేళ ఎవరూ ఆమెను ఎంచుకోకపోతే తన జీవితం తాలూక ప్రయోజనాన్ని చేజార్చుకున్న స్త్రీల జాబితాలో ఆమె పేరు చేరిపోతోంది.** ఇటువంటివారు పేదరికంతో జీవితాంతం బాధపడాల్సిందే. ఆ కాలంలో స్త్రీకి పెళ్లి విషయంలో పరిస్థితులు ఎంత మాత్రం అనుకూలంగా లేవని వీటన్నిటిబట్టి తెలుస్తోంది. ఇలా పెళ్లి అనేది కష్టమైనదిగా తయారవడానికి ఇంకా కొన్ని కారణాలున్నాయి. పెళ్లి చేసుకోకుండా ఉండమంటూ పురుషులపై ప్రభుత్వం ఒత్తిడి తెస్తోంది.

ఒక సైనికాధికారి పెళ్లి **చేసుకోవాలంటే అతనికి పై అధికారుల అనుమతి తప్పనిసరి. తన భార్యను స్వేచ్ఛగా ఎంచుకునే హక్కు కూడా అతనికి లేదు. పెళ్లి చేసుకోవాలంటే అతనికి కొంత ఆస్థి ఉండాలి. అతను పెళ్ళాడబోయే అమ్మాయి మచ్చలేని జీవితం గడిపినదై ఉండాలి. ఆర్మీలో కెప్టెన్ అయితే 30 ఏళ్ళలోపు వయసువాడైతే సెక్యూరిటీగా కొంత ధనం ఇవ్వాలి. 30 ఏళ్ళు పైబడినవారుకూడా ఎంతో కొంత ధనం సెక్యూరిటీగా ఇవ్వాలి.** మగవారు స్వతంత్రంగా తమ కుటుంబాన్ని పోషించుకోగలిగితేనే వారికి వివాహం జరిగేది. అప్పటికి వారికి 24, 25 సంవత్సరాల వయసు వచ్చేది. ఆడపిల్లకి 15, 16 ఏళ్ళకి వివాహ వయసు వచ్చినట్టు అనుకునేవారు.

రాజ కుటుంబీకులలో యువకులకు మాత్రం 15, 16 ఏళ్ళ వయసు వచ్చేటప్పటికే వివాహాలు జరిపేవారు. ఈ అంశాలన్నీ పరిశీలిస్తే వివాహ వ్యవస్థను సామాజికాంశాల ఆధారంగా నిర్మించారని తెలుస్తోంది. ఇలా అనేక కారణాలవల్ల పురుషులకు కూడా వివాహం జరగకపోవడం అనేది పెరిగింది. ఈ కారణాలే స్త్రీల వివాహాలకు కూడా అంతరాయంగా మారాయి. పెళ్ళికి సామాజిక అర్హత కలిగిన వ్యక్తులు లేకపోవడంవల్ల స్త్రీలు కూడా అవివాహితులుగా మారారు. ఇలా అనేకమంది పరిశీలనలో దాదాపు అన్ని దేశాలలో ఆర్థిక నిర్మాణం, సామాజిక పరిస్థితులు కూడా ఒకేలా ఉన్నాయని తెలుస్తోంది. ◆

- డాక్టర్ విజయబక్ష్

# అటు శవాల గుట్టలు.. ఇటు నిర్లక్ష్యపు నీడలు!

ఆసలు నీకు ఉత్తరం రాయడానికి కూడా మనస్కరించడం లేదు. చాలా ప్రాణ నష్టం జరిగింది. హితులు, స్నేహితులు, శ్రేయోభిలాషులు, బంధువులు ఇంకా ఎందరో తెలిసిన వారు కనుమరుగయ్యారు. ఉన్నవాళ్లంతా ప్రాణ భయంతో కొట్టుమిట్టాడుతున్నారు. భారతదేశ ప్రజలంతా ఒకానొక భయంకర వాతావరణంలో బతుకీడుస్తున్నారు. ఏ నిమిషాన కరోనా మహమ్మారి ఎవరిపై విరుచుకుపడుతుందో తెలీదు. **నా అనేవారిని కంటి నిండా కడసారి చూసుకోవడానికి, చేతులారా చివరిసారి స్పృశించడానికి లేక తనవారు పరాయివారు అన్నట్టుగా వెళ్లిపోతుంటే నిస్తేజంగా, నిస్సహాయంగా అయినవారు చూస్తూ ఉండిపోతున్నారు. ఈ ఘాతుకానికి ఎవరిని బాధ్యులుగా చేయాలి?**

**పిట్టల్లా ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారు. గుప్పెడంత గాలి దొరక్క విలవిలలాడి చనిపోతున్నారు. చనిపోయినవారికి శ్మశానంలో కూడా చోటు దొరక్క గుండెలవిసేలా రోదించే జనానికి సమాధానం ఎవరు చెబుతారు?** ఉన్నవాళ్లు అన్నీ అమ్మి ఆస్పత్రుల్లో అయితే ప్రాణాలు నిలుస్తాయని గంపెడాశతో ప్రాణవాయువు కోసం వచ్చిన వారి ప్రాణాలు నిలువునా తీసేస్తే ఆ పాపానికి బాధ్యులెవరు?



**ఎన్నికల్లో గెలవడానికి అధికార పీఠాలెక్కడానికి ఎడాపెడా వాగ్దానాలు చేసి ప్రజలను మభ్య పెట్టి పీఠాలెక్కి కూర్చున్న తరువాత ఎటూ మనం చెప్పినవి కల్లబొల్లి కబుర్లే కాబట్టి వాటిల్లో ఉన్నది కల్లే కదా అని వాగ్దానాలు మరిచిపోయి ప్రజల ప్రాణాలు గాలికొదిలేసిన మన నాయకులను ఏం చేస్తే ప్రాణాలు తిరిగి వస్తాయి?**

**మానవాళి చరిత్రలో ఇది అత్యంత విషాదభరితమైన గడ్డుకాలం.**

ప్రజలంతా 2020 సంవత్సరం మార్చికి ముందున్న రోజులు తిరిగి వస్తాయా? మళ్లీ ఆ రోజులు చూడగలుగుతామా అని ఆందోళన చెందుతున్నారు.



మనిషి సంఘజీవి. తానొక్కడు, తనవారే కాదు తన చుట్టు పక్కల వారు కూడా సుఖసంతోషాలతో గడిపితేనే తనకూ సంతోషం. తన చుట్టూ ఉన్న వారు దు:ఖంతో దిక్కుతోచకుండా పడి ఉంటే తాను మాత్రం సంతోషంగా ఎలా ఉంటాడు? ఈ పరిస్థితులు చూస్తూ ఉంటే అసలు నాయకులకు నిద్ర ఎలా పడుతోంది? తిండి ఎలా సహిస్తోంది? స్వార్థపరమైన రాజకీయాలకు తమతమ అహం కారపూరిత దర్పాలకు ప్రజలను బలి చేశారు.

కరోనా సెకండ్ వేవ్ ప్రమాదం పొంచి ఉందని తెలిసే ఎన్నికలు ఉన్నపళంగా పెట్టడం, ఒక్కసారే పూర్తయ్యేవాటిని ఎనిమిది విడతలుగా సాగదీయడం, కుంభమేళాలకు లక్షల మందిని ప్రత్యేక రైళ్ళు పెట్టి మరీ పోగెయ్యడం, మందు షాపులు బార్లా తెరిచి జనాన్ని మాయబుచ్చడం... లాంటి వాటికి ఎవరు కారకులు? ఇదంతా ప్రజాభీష్టం ప్రకారం జరగడం లేదు కదా. **సరిపడా ఆస్పత్రుల్లేవు. మందుల్లేవు. డాక్టర్లు, బెడ్లు, ఆక్సిజన్, వెంటిలేటర్లు ఏవీలేవు. ఇవన్నీ సమకూర్చలేని ప్రభుత్వాధినేతలు మనిషి చనిపోయాక రూ.10వేలు ఇస్తాం.. రూ.15వేలు ఇస్తాం... ఆక్సిజన్ అందక మరణించిన వారి కుటుంబాలకు రూ.10 లక్షలు ఇస్తామని వెర్రిమొర్రి ప్రకటనలు చేస్తున్నారు.** పోయిన మనిషిని ఎటూ తేలేరు. అందుకే ఈ పిచ్చి వాగ్దానాలతో జనం నోరు కట్టేస్తున్నారు.

**74 ఏళ్ల స్వతంత్ర భారతంలో ఓటుహక్కు మాత్రమే ఉన్న ప్రజలకు జీవించే హక్కు లేకుండా చేసిన ఈ ప్రభుత్వాలను ఎందుకు మన్నించాలి?**

→

ఇట్లా ఎందుకు జరుగుతోందనే స్వేచ్ఛ కూడా ప్రజలకు లేకుండా అబద్ధపు ప్రచారాలు, అవాస్తవాలు, ప్రచార ఆర్భాటాలతో ఉష్ట్ర పక్షిలా బతికేస్తున్నారు. ప్రపంచం అంతా మన చేతగానితనాన్ని వేలెత్తి చూపుతున్నారన్న జ్ఞానమైనా లేదు. మందులు బ్లాకులో అమ్ముకుంటున్న వారిని నియంత్రించడం చేతగాదు. లక్షల్లో ఫీజులు వసూలు చేస్తున్న ఆస్పత్రులను కట్టడి చేయడం రాదు. చావు బతుకుల మధ్య ఊగిసలాడుతున్న వారిని వైద్యశాలకో, శ్మశానానికో చేర్చడానికి వేలల్లో దండుకుంటున్న అంబులెన్సులను అడ్డుకోవడం రాదు. కానీ మన ప్రభుత్వానికి దేశమంతా మనవైపు చూసేలా చర్యలు చేపట్టామని చెప్పుకోవడం మాత్రం బాగా వచ్చు.

పవిత్ర గంగా మాత అన్ని కల్మషాలను తనలో దాచుకున్నట్లే శవాలను కూడా తనలో దాచుకోలేక శవాలను ఒడ్డుకు విసిరేస్తోంది. ఇదంతా మన ప్రభుత్వ వైఫల్యమా? సాఫల్యమా? బాధ్యతలు మర్చిపోయి వైరస్‌ను వ్యాపింపచేయడంలో ప్రజలు ఎంత తెలివితక్కువగా ప్రవర్తిస్తున్నారో ప్రభుత్వాలు అంతకన్నా వెయ్యి రెట్లు బాధ్యతా రహితంగా వ్యవహరించాయి. ఇదొక జాతీయ విపత్తుగా పరిగణించి **ఎక్కడికక్కడ యుద్ధప్రాతిపదికన తాత్కాలిక ఆస్పత్రులను ఏర్పాటు చేయాలి. నగరాలకు పరిగెత్తకుండా మండల స్థాయిలోనే మెరుగైన వైద్యం అందించే ఏర్పాట్లు చేయాలి. పరీక్షలను ఉచితంగా చేయించి సత్వరమే ఫలితాలు తెలియజేయాలి.**

ఆరోగ్యశ్రీలో చేర్చినా వైద్యం అందక అంబులెన్స్‌లలో ప్రాణాలు పోతున్నా కొవిడ్-19 పరిస్థితిపై నోరువిప్పి మాట్లాడలేని ప్రజాప్రతినిధులు ప్రశ్నించే ప్రతిపక్షాలపై మాటల తూటాలు విసరడానికి, రాజకీయ కక్షలు తీర్చుకోవడానికి మాత్రం పోటీపడుతున్నారు. వీటిపై చూపే శ్రద్ధ తమ నియోజకవర్గంలో కరోనాబారిన పడిన ప్రజలకు ధైర్యం చెప్పడంలో చూపితే వారిచ్చే భరోసాతో ప్రజలు కొందరైనా బతికి బట్టకడతారు. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లు సరైన సమయంలో సరైన జాగ్రత్తలు తీసుకుంటే ఇన్ని ప్రాణాలు గాలిలో కలిసేవి కాదు.

అమ్మా ఆశా! అంతా జాగరూకతతో మెలగండి. అన్ని రకాలైన జాగ్రత్తలు తీసుకోండి. ◆

# 'ధీర' వనితవై..



ఒక మహిళ తనకు తన ఆరోగ్యానికి, భవిష్యత్తుకు తోడ్పడే నిర్ణయం తీసుకునే విషయంలో పూర్తి హక్కులు కలిగి ఉండాలి. గర్భం ధరించాలా? దాన్ని కొనసాగించాలా? లేక తొలగించుకోవాలా? అనే నిర్ణయం పూర్తిగా ఆమె హక్కు. ఆమె శరీరంపై సర్వహక్కులూ ఆమెవే. భర్త, అత్తవారు ఆమెను బలవంత పెట్టకూడదు. గత 20 ఏళ్లుగా ఈ అంశం పట్ల మహిళలను చైతన్యవంతులను చేస్తున్న డాక్టర్ శాంతకుమారి అభిప్రాయాలివి. స్త్రీల వైద్యులకు సమాజంలోని మహిళలతో దగ్గర సంబంధం ఉంటుంది. స్త్రీలు తరచుగా నెలసరి నొప్పులు, ప్రసవం మొదలైన అన్ని సందర్భాల్లో తరచుగా వైద్యులను కలుస్తారు. తమ ఇబ్బందులను డాక్టర్‌తో పంచుకుంటారు. ఆ క్రమంలో వాస్తవాలు తెలుసుకుని విస్తుపోయారు. ఒక వైద్యురాలు తమ సామాజిక వర్గాల్లో ఉన్న కట్టుబాట్లను వేరొక మహిళపై రుద్ద కూడదు. ఆమె గర్భవిచ్ఛిత్తి కోరితే అంగీకరించాలి. కాలు నొప్పికో, కన్ను నొప్పికో తనను కలిసిన రోగి పట్ల ఎటువంటి బాధ్యతా చూపుతారో అబార్షన్ కోసం వచ్చిన మహిళపై కూడా అటువంటి బాధ్యతనే చూపాలి. ఆమె పరిస్థితిని బట్టి ఆమె కోరికను అంగీకరించాలి అంటారీమె. ఈమెది వైద్య కుటుంబం. ఈమె యశోద ఆస్పత్రిలో గైనకాలజిస్టుగా పని చేస్తున్నారు.

ఒక గైనకాలజిస్టుగా మహిళల పట్ల హింసను అడ్డుకోవడంలో స్త్రీల వైద్యులది కీలకమైన పాత్ర అని ఈమె నమ్మకం. ఈ క్రమంలో ఆమెకు ఎదురైన కొన్ని కేసులు ఆమెను ధీర ప్రాజెక్టు రూపకల్పనకు పురిగొల్పాయి. మహిళల పట్ల హింస అనేది సాదాసీదా వ్యవహారంగా భావించక దాన్ని తీవ్రంగా పరిగణించ వలసిన ఆవశ్యకత తెలియజేయడమనే ఈ ప్రాజెక్టు ఉద్దేశం. ప్రసూత సమయంలో ఎంతోమంది మహిళలు మరణిస్తుంటారు. దానికి కారణం ప్రసూతి సమయంలో వచ్చే హైపర్ టన్షన్ అని వైద్యులు పొరపడతారు. వాస్తవానికి హింసల వల్ల మహిళల మానసిక, శారీరక ఆరోగ్యం క్షీణిస్తుంది. ఇటువంటి అనారోగ్య సమస్యలను ఎదుర్కోవడానిక షీ టీమ్స్‌తో, నేషనల్ కమిషన్ ఆఫ్ ఉమెన్‌తో కలిసి ఎన్నో కార్యక్రమాలను ధీర ప్రాజెక్టులో వివరించారీమె. 'సే నో టు వైలెన్స్' అనడం కంటే 'వైలెన్స్ బై ది మెన్' అనడం సరైన పద్ధతి అంటారీమె. ◆

ప్రత్యేకం

సి.కమలకుమారి

# సూర్యావతి గారితో నా జ్ఞాపకాలు

**నా** నాకు 10 సంవత్సరాల వయస్సులో (1962)లో మా కుటుంబం తెలంగాణాలోని ఆదిలాబాద్ జిల్లా లక్సెట్టిపేటకు వలస రావడం జరిగింది. నా పాఠశాల చదువు లక్సెట్టిపేటలో 3సం॥లు (6, 7, 8 తరగతులు) మాత్రమే. తరువాత నేను హిందీ చదువుకున్నారు. టీచర్ ట్రైనింగ్ కొరకు హైదరాబాద్‌కు వెళ్ళాను. మా అక్కగారి ఇంటి ఎదురుగానే కామ్రేడ్ ఎన్.వి. భాస్కర్‌గారి ఇల్లు. వారి కుటుంబంతో ఆత్మీయ సంబంధాలు ఉండేవి. అలా నేను వారింటికి వెళుతూ ఉండేదాన్ని. ఒక సందర్భంలో **భాస్కరరావు గారి ఇంటిలో మానికొండ సుబ్బారావుగారు, సూర్యావతి గార్లను 1972లో చూడటం జరిగింది. ఆరోజు సూర్యావతిగారు మాట్లాడే విధానం నన్ను బాగా ఆకర్షించింది.** ఆ సౌమ్యత, నిదానంగా చెప్పే విధానం. ఆరోజు నేను వారితో ఏమీ మాట్లాడలేదు. ఆమె మాటలు, ఆమె పట్ల ఒక గౌరవం, ఆరాధనా భావం. అందుచేత ఆమె నాకు గుర్తుండిపోయారు. అప్పటికి నా వయస్సు 20 సంవత్సరాలు. నా టీచర్ ట్రైనింగ్ నాటికే తరిమెల నాగిరెడ్డిగారి రాజకీయ భావాలను ఆమోదించే సంస్థలు జీవనాడి, నవోదయ సాంస్కృతిక సంస్థలతో సంబంధం కలిగియుండేదానిని. నా 22సం॥(1974)లో నాకు ఉపాధ్యాయినిగా ఉద్యోగం ఆదిలాబాద్ జిల్లాలోనే రావడం జరిగింది. 1977 ఎమర్జన్సీ అనంతరం రకరకాల కారణాలవలన నవోదయ సంస్థతో నా సంబంధాన్ని విరమించుకోవడం జరిగింది. 1978లో నేను ఉపాధ్యాయ సంఘం యు.టి.ఎఫ్.లో చేరడంతో సమావేశాలకు విజయవాడ వచ్చేదానిని. 1979లో మద్రాసులో "శ్రామిక మహిళా" సభలు జరిగితే

**సూర్యావతి గారు నాకెలా స్ఫూర్తో.. నాలో చైతన్యాన్ని మరింత పెంచడంలో వారి పాత్ర ఎంతో చర్చించాలంటే ముందుగా నా నేపథ్యాన్ని పరిచయం చేసుకోవాలి. నేను పుట్టింది కృష్ణా జిల్లాలో. ఆచార వ్యవహారాలు, నిత్య దైవారాధన, కుల కట్టుబాట్లకు ప్రాధాన్యతనిచ్చే కుటుంబంలో పుట్టాను. క్రిష్టియన్సు టీచర్స్‌గా ఉన్నారని ప్రభుత్వ పాఠశాలకు పంపలేదు. ఇంటిదగ్గరే ఒక మాస్టర్‌ని పెట్టి చదివించారు.**

యు.టి.ఎఫ్.నుండి నన్ను ప్రతినిధిగా పంపారు. ఆ మహాసభలలో జాతీయ, రాష్ట్ర నాయకులనేకమంది నన్ను ప్రభావితం చేశారు. హైదరాబాద్‌లో ఎన్.వి. భాస్కరరావు గారింటిలో చూసిన తరువాత సూర్యావతి గారిని మళ్ళీ మద్రాసులోనే చూశాను. ఆమె ఆలోచనలే స్ఫూర్తిగా నేను ఆదిలాబాద్ జిల్లాలో మందమర్రి, రామకృష్ణాపూర్‌లు కేంద్రంగా మహిళాసంఘ స్థాపనకు పూనుకున్నాను 1980లో. 500 మంది సభ్యత్వంతో మొదలై, 1985వ సంవత్సరం త్రివేండ్రం అఖిలభారత మహాసభల నాటికి 4 వేలకు పైగా సభ్యత్వం చేయించగలిగాను. నేను పనిచేస్తున్న ఉపాధ్యాయరంగంలో ఆ సంఘ అభివృద్ధికి కృషిచేస్తూ, దానిని విస్తరింపచేసుకుంటూనే మహిళాసంఘ పెరుగుదలకు కృషి చేశాను. దీనికికూడా స్ఫూర్తి సూర్యావతిగారే. **సంఘం స్థాపించిన తరువాత మహిళాసంఘ రాష్ట్ర కమిటీ సమావేశాలలో కంటె, ఎలా పనిచేయాలనే విషయమై సూర్యావతిగారి సలహాలే ఎక్కువగా ఉపయోగపడేవి. ఆమెను ఇంటిలో వ్యక్తిగతంగా కలవడంద్వారా కావచ్చు. ఉపాధ్యాయ సంఘ పనిని, మహిళా సంఘ పనిని ఎలా సమన్వయం చేసుకోవాలో సూచన లిచ్చేవారు. ఉపాధ్యాయులు చదువుకున్న వారు కాబట్టి వారితో ఉత్తర ప్రత్యుత్తరాలతో సంబంధాలు పెంచుకోవాలని, మహిళా సంఘ సభ్యులను, కార్యకర్తలను భౌతికంగా కలుసుకోవడం ద్వారా సమస్యలు చర్చించి కదిలించాలంటూ సూచనలిచ్చేవారు.**

1982లో అనుకుంట సూర్యావతిగారు, పుట్టగుంట సుబ్బారావుగారు పార్టీ సంబంధిత పనులతో ఆదిలాబాద్ జిల్లా బెల్లంపల్లికి వచ్చారు. ఆ సందర్భంగా ఐదు రోజులున్నారు. మా ఇంటిలోనే వారి బస. వారున్నన్ని రోజులు సంఘ బాధ్యతలు నిర్వహించే క్రమంలో సమాజంలో వారు ఎదుర్కొన్న సమస్యలు , ఏ ఏ సమస్యల పరిష్కారం కోసం కృషి చేసేవారో తెలుసుకున్నాను. వారు మా ఇంటిలో ఉన్నప్పుడు వారిచ్చిన సలహాతోనే మందమర్రిలో మరుగుదొడ్లు, నీటి కుళాయి, బొగ్గు ఇచ్చే కేంద్రాల పెంపు కొరకు కృషి చేసి సాధించుకోవడం జరిగింది. ఈ ప్రాంతం ప్రధానంగా బొగ్గు గనుల ఏరియా, కార్మికవర్గం నివసించే ప్రాంతం. మొత్తం పట్టణానికి బొగ్గు ఇచ్చే కేంద్రం ఒక్కటే ఉండేది. మహిళలే గంపలతో బొగ్గు తెచ్చుకునేవారు. అలా తెచ్చుకునే క్రమంలో రోడ్డు, రైలు పట్టాలు దాటే సందర్భంలో అనేక ప్రమాదాలు జరిగేవి. సూర్యావతిగారు ఇచ్చిన సలహా మేరకు ఈ సమస్యను పరిష్కరించు కోగలిగాం. సూర్యావతిగారి ప్రభావం, సూచనలతో జిల్లాలో మహిళా సంఘానికి ఒక ఉనికి రావాలని కలలు కన్నాను. కాని అనుకోకుండా మహిళా సంఘ బాధ్యతలనుంచి తప్పుకోవలసి వచ్చింది. సూర్యావతి గారి జ్ఞాపకాలు ఎప్పటికీ చెదిరిపోనివి. ఈనాటికీ ఉత్తేజాన్ని కలిగించేవి గానే ఉంటాయి. ◆



# కా.రంజనా సేవలు చిరస్మరణీయం

**కామ్రేడ్ రంజనా. ఈ పేరు వినగానే గుర్తొచ్చే చెరగని ఆమె చిరునవ్వు, స్నేహ స్వభావం. "కైసే హై కామ్రేడ్" అంటూ అందరూ పిలుచుకునే ఆమె ఉన్నత కుటుంబంలో పుట్టినా నిరాడంబరంగానే జీవించారు. కార్యకర్తలంటే ఆప్యాయత. 2021లో అనేకమంది ఆత్మీయులనూ, నాయకులనూ, కార్యకర్తలనూ పొట్టనపెట్టుకున్న కరోనా ఆమెనూ బలితీసుకుంది. కా.రంజనా మే 10, 2021న కరోనాతో ఢిల్లీలో మృతిచెందారు.**

కా. రంజనా నిరులా1945లో ఢిల్లీ లో పంజాబీ జమీందార్ల కుటుంబంలో పుట్టారు. ఆవిడ తండ్రి యునైటెడ్ నేషన్స్ లో డాక్టర్. పై చదువుల కోసం రంజనా అమెరికా వెళ్లిన సమయంలోనే వియత్నాం యుద్ధం ఉధృతంగా జరుగుతోంది. ఆ తరంలోని అనేక మంది యువత లాగ ఆమె కూడా ఆ ఉద్యమానికి ఆకర్షితురాలవటమే కాక సంఘీభావ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొన్నారు కూడా. ఆ క్రమంలోనే అమెరికాలోని వామపక్ష ఉద్యమానికి దగ్గరయ్యారు. అప్పుడే తన జీవిత లక్ష్యాన్ని నిర్ణయించుకుని 70 దశకం ప్రారంభ రోజుల్లో భారతదేశానికి తిరిగి వచ్చారు. ఇక్కడ వామపక్ష ఉద్యమంలో భాగస్వామి అయ్యారు. 1978లో సీఐటీయూ పూర్తికాలం కార్యకర్తగా పని చేయడం ప్రారంభించారు. ఆమె చివరి శ్వాస వరకు తన లక్ష్య సాధనలో పీడిత ప్రజల విముక్తి, సమాజ మార్పు కోసం పనిచేశారు.

**ఉన్నత విద్య, విలాసవంతమైన జీవితం గడపటానికి అవకాశాలు ఉన్నప్పటికీ వాటన్నిటినీ కాదనుకుని ఉద్యమబాటను ఎంచుకోవటం విప్లవోద్యమం పట్ల ఆమెకు గల నిబద్ధతకు నిదర్శనం. తాను ఏ వర్గం కోసం, ఏ ప్రజల సమస్యలపైన పనిచేయాలని నిర్ణయించుకున్నారో, వారి జీవన, పని పరిస్థితులను ప్రత్యక్షంగా తెలుసుకోవటం కోసం రంజన ఢిల్లీ సమీపంలోని ఫరీదాబాద్ లోని కార్మికవాడలో నివాసముండి వారిలో ఒకరిగా జీవించారు. అక్కడి పారిశ్రామిక కార్మికులతో సంబంధాలు ఏర్పరచుకొని, వారి సమస్యల పరిష్కారం కోసం సీఐటీయూ జెండా కింద సంఘటితం చేసి పోరాటాలలో భాగస్వాములను చేశారు. ఇప్పుడు సీఐటీయూ చేపట్టిన "చేరుకోని కార్మికులను చేరటం" అనే నినాదాన్నీ కా.రంజన అప్పుడే అమలు చేసి చూపించారు.**

**దూరదృష్టి గల నాయకురాలు :**

సుమారు ఏభై ఏళ్ల ఉద్యమ జీవితంలో కా. రంజనా నిరులా అనేక బాధ్యతలను చేపట్టారు. ఏ బాధ్యతల్లో ఉన్నా దానికి పూర్తి న్యాయం చేకూర్చారు. ఢిల్లీలో ఐద్వా స్థాపించి, విస్తరింపజేయడంలో కీలక పాత్ర పోషించారు. ఆమె ఐద్వా మొట్టమొదటి సెంట్రల్ ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యురాలు. ప్రజారోగ్యం, సాంఘిక భద్రత, మహిళల ఉపాధి మొదలైన అంశాలపై గ్రామీణ, పేద మహిళల ను చైతన్యపరిచి పోరాటాలలో భాగస్వాములను చేశారు.

**ఐద్వాతో ఆమె బంధం విడదీయరానిది:**

కార్మికోద్యమంలో మహిళల భాగస్వామ్యం పెంచాలని, వారిని నాయకత్వంలోకి ప్రోత్సహించాలని, అందుకు ఒక వేదిక అవసరమని గుర్తించి, సీఐటీయూ వ్యవస్థాపక అధ్యక్షులు కా. బీ.టీ.రణదివే గారి మార్గదర్శకత్వంలో "అఖిల భారత శ్రామిక మహిళా సమన్వయ కమిటీ" ఏర్పాటైంది. దీనిలో కూడా రంజనా కీలక పాత్ర పోషించారు. 1970లలో ఈ కమిటీ ఏర్పాటయ్యే నాటికి బ్యాంకులు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాలు మొదలైన సంఘటిత రంగాలలో కూడా మహిళలకు ప్రత్యేక మరుగుదొడ్లు ఉండేవి కావు. యాజమాన్యాలు గానీ, యూనియన్లు గానీ దానిని ఒకసమస్యగానే పరిగణించే వారు కాదు.

→

శ్రామిక మహిళల పని పరిస్థితులకు ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ఇలాంటి సమస్యలను అధ్యయనం చేసి, పరిష్కరించేందుకు చేపట్టిన అనేక కార్యక్రమాలలో కా.రంజన భాగస్వామ్యం చెప్పుకోదగ్గది.

అసంఘటిత రంగంలోని మహిళల పరిస్థితులపై ఆమెకు అపారమైన అవగాహన ఉండేది. 2009లో సీఐటియూ ఏర్పాటు చేసిన ఆశా వర్కర్ల అఖిల భారత సమన్వయ కమిటీకి కన్వీనర్‌గా నియమించబడి, చివరి వరకు కొనసాగారు.

సీఐటీయూ మాసపత్రిక "ది వాయిస్ ఆఫ్ వర్కింగ్ విమెన్" ఎడిటర్‌గా ఆమె పాత్ర మరువలేనిది. జాతీయ స్థాయిలో వెలువడే పత్రికకు సంపాదకత్వం వహించటమంటే మాటలు కాదు. సమయానికి పత్రికని తీసుకురావడం మొదలు, పాఠకులకు దానిని అందించటంలోను, సర్కులేషన్ పెంచటం వరకు కా.రంజనా ఎంతో తాపత్రయ పడేవారు. తన వయసును కూడా లెక్కచేసే వారు కాదు. రాష్ట్రాల నుండి వార్తలు పంపకపోయినా, చందాలు సమయానికి చేర్పించక పోయినా సున్నితంగానే మందలించేవారు. మరణించే నాటికి కూడా ఆమె ఎడిటర్‌గా కొనసాగుతున్నారు.

**సీఐటీయూ ఢిల్లీ కమిటీకి మాత్రమే కాక సీఐటియూ అఖిల భారత కోశాధికారిగా కూడా బాధ్యతలు నిర్వహించిన మొదటి మహిళ కా.రంజన. మహిళల హక్కుల పక్షపాతి. మతోన్మాద ఫాసిస్టులను విమర్శించటంలో రాజీపడని వామపక్షవాది.** అంతేకాదు. ఉద్యమంలో పనిచేసే క్రమంలో తన అభిప్రాయాన్ని ఆయా వేదికలపై నిర్మొహమాటంగా, సూటిగా వ్యక్తీకరించే వారు. యువ కార్యకర్తలను ప్రోత్సహించే వారు. విషయాలను ఓపికగా వివరించేవారు. ఆమె అత్యంత స్నేహశీలి. తోటి కార్యకర్తల పట్ల ఎంతో శ్రద్ధ చూపేవారు. ఆప్యాయంగా ఆదరించేవారు. పేద ప్రజలంటే అపరిమితమైన జాలి. వారికి చేతనైన సాయం చేయటంలో ఎంతో తృప్తి చెందేవారు. ఆమె నిజమైన మానవతావాది.

**బహుముఖ ప్రజ్ఞ, పార్శ్వాలు కలిగిన విలువైన కామ్రేడ్‌ను కార్మికోద్యమం కోల్పోయింది. లక్ష్యం పట్ల స్పష్టమైన వైఖరి, ఆచరణలో చూపిన నిబద్ధత, సమస్యల పరిష్కారం కోసం చేసిన రాజీలేని పోరాటం వీటి నుండి కార్యకర్తలు స్ఫూర్తిని పొందాలి. ఆమె ఆశయాలను ముందుకు తీసికెళ్లేందుకు కృషి చేయాలి. దేశ ప్రజలపైన ప్రభుత్వం క్రూరమైన దాడికి పాల్పడుతూ, హక్కులను హరిస్తున్న వేళ మనం మరింత సమగ్ర దృష్టితో పనిచేయాలి. అందుకు కా.రంజనా లాంటి నాయకులే మనకు ప్రేరణ, ఆదర్శం. అదే మనం వారికి ఇవ్వగలిగే గొప్ప నివాళి.** ◆

---



# జాతి భద్రతకు వ్యతిరేకం కాదు!

లక్షద్వీప్ ఫిల్మ్ మేకర్, ఉద్యమకారిణి ఆయేషా సుల్తానాకు కేరళ హైకోర్టు ముందస్తు బెయిల్ మంజూరు చేసింది. లక్షద్వీప్ అడ్మినిస్ట్రేటర్ ప్రఫుల్ పటేల్‌పై వ్యతిరేకంగా మాట్లాడినందుకు సుల్తానాపై దేశద్రోహ కేసు నమోదైంది. కానీ సుల్తానా వ్యాఖ్యల్లో స్పష్టమైన ఆరోపణలూ లేవు. జాతి ప్రయోజనాలకు వ్యతిరేకం కాదు. ఇంకా ఒక తరగతి పనులను వ్యతిరేకిస్తూ ఆరోపణలు చేయలేదు. ఆమెకు ఎటువంటి నేర చరిత్ర లేదు. న్యాయం నుంచి పారిపోయే అవకాశం ఆమెకు లేదు. కనుక ఆమెను జైల్లో నిర్బంధించడం కస్టడీలో ఉంచడం ఈ మహమ్మారి సమయంలో అనవసరమని ఆమెకు ముందస్తు బెయిల్ మంజూరు చేశారు. ఆమె చేసిన వ్యాఖ్య ఏమంటే లక్ష్య ద్వీప్‌లో కరోనాను నియంత్రించడంలో విఫలమైన ప్రఫుల్ పటేల్‌పై ఒక టీవీ ఛానల్ షోలో ఆయేషా విమర్శించారు. అదే ఆమె చేసిన నేరం. ◆

# పేదరికం ప్రతిభకు అడ్డుకాదు!



పట్టుదల శ్రమ ఉండాలనే కానీ ఎటువంటి సమస్యనైనా సులభంగా అధిగమంచొచ్చని ప్రత్యక్షంగా నిరూపించింది 14 ఏళ్ల చంచలా కుమారి. ఈమె జార్ఖాండ్‌లోని ఒక మూరుమూల గిరిజన ప్రాంతానికి చెందిన అమ్మాయి. ఈమె నేడు ప్రపంచ కుస్తీ పోటీలకు ఎంపికైంది. ఈ ఘనత సాధించిన జార్ఖండ్ క్రీడాకారిణిగా అరుదైన గుర్తింపు సొంతం చేసుకుంది. ఆ రాష్ట్రం నుంచి రెజ్లింగ్‌లో అంతర్జాతీయ స్థాయికి ఎదిగిన ఆటగాళ్లు ఎవరూ లేరు. ఆ లోటును భర్తీ చేస్తూ భారతదేశం తరుపున కుస్తీ పోటీల్లో చంచల ప్రాతినిథ్యం వహించనుంది. ప్రపంచ కుస్తీ పోటీల్లో 40 కేజీల సబ్‌జూనియర్ కేటగిరీ విభాగంలో భారత్ తరుపున ప్రాతినిథ్యం వహించనున్న తొలి క్రీడాకారిణి ఈమె. ◆



# శాస్త్రవిజ్ఞాన 'రత్న'ం!

అంతరిక్ష విజ్ఞాన రంగ పరిశోధకురాలు శ్రీమతి డాక్టర్ నందివాడ రత్నశ్రీ (57). ఈమె నెహ్రూ ప్లానిటోరియం డైరెక్టర్. 1963లో విశాఖలో జన్మించారు. ఈమె తండ్రి నందివాడ భీమారావు. తల్లి శ్యామలా. నలుగురు సంతానంలో ఈమె మూడో వ్యక్తి. ఈమె ప్రాథమిక విద్య అంతా ఆంధ్ర, ఒడిషా, యూపీలో జరిగింది. డిగ్రీ హైదరాబాద్ కోఠి మహిళా కళాశాలలో సాగింది. సెంట్రల్ యూనివర్శిటీ హైదరాబాద్‌లో ఎమ్మెస్సీ చదివారు. ముంబై విశ్వవిదాలయంలో పిహెచ్‌డీ పూర్తి చేశారు. చిన్న వయస్సు నుంచే ఈమెకు ఆకాశం, గ్రహాలు, నక్షత్రాలు గురించి ఆసక్తి ఎక్కువ. కాలక్రమంలో ఈమెకు అంతరిక్ష విజ్ఞానం, భౌతిక శాస్త్రంపై ఆసక్తి పెరిగింది. తీరిక సమయంలో గ్రంథాలయాల నుంచి వీటికి సంబంధించిన పుస్తకాలు తెచ్చుకుని చదివేవారు. ఈ రంగంలో పరిశోధన చేయాలనేది ఈమె ఆకాంక్ష. 1986లో హెయిలీ తోక చుక్కను చూడటం, హైదరాబాద్ సమీపంలోని రంగాపురంలో నిజామియా అబ్జర్వేటరీ సందర్శించడం.. వంటి అవకాశాలు కూడా ఆవిడలోని ఆకాంక్షను ద్విగుణీకృతం చేశాయి.

ఈమె ముంబాయిలోని 'టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసెర్చ్' సంస్థ నుంచి పీజీ డిపార్టుమెంట్ ఆఫ్ ఆస్ట్రానమీ చేశారు. పోస్టు డాక్టొరల్ రీసెర్చ్ యూనివర్శిటీ ఆఫ్ వెర్మాంట్ బర్లింగ్‌టన్‌లో చేశారు. అక్కడ 1980 నుంచి 1990 వరకు ఈమె ఉద్యోగ జీవితం గడిపారు. స్టెల్లార్ ఇవల్యూషన్ మరియు పాపులేషన్ సింథసిస్‌లో ఈమె ప్రొఫెసర్ అలక్‌రేతో కలిసి పని చేశారు. తరువాత ఆర్ఆర్ఐ బెంగళూరులో 1994 నుంచి 1996 వరకు పోస్టు డాక్టొరల్ ఫెలోగా పని చేశారు. ఈ సమయంలోనే ఈమె లార్జ్ మాగెలానిక్ 'క్లౌడ్' మరియు రేడియో ఎమిషన్ మరియు అసోసియేటెడ్ పోలరైజేషన్ ప్రాపర్టీలపై కూడా తన దృష్టిని మళ్లించారు.

పిహెచ్‌డి అనంతరం ఈమెకు బెంగళూరులోనే ఉద్యోగ అవకాశాలు మెండుగా ఉన్నా.. భర్త ఉద్యోగ రీత్యా ఆమె అక్కడ ఉద్యోగానికి రాజీనామా చేసి భర్త శ్రీ పాట్రిక్‌దాస్ గుప్తా గారితో ఢిల్లీ వెళ్లిపోయారు. వారక్కడ ఢిల్లీలోని యూరివర్శిటీలో ప్రొఫెసర్. **రత్నశ్రీ మొట్టమొదటిగా ఢిల్లీ ప్లానిటోరియంలో ఎడ్యుకేటర్‌గా పని చేశారు. కానీ అతి తక్కువ కాలంలోనే ప్లానిటోరియం డైరెక్టర్ పదవి ఆమెను వరించింది. 21 సంవత్సరాలు ఆమె ఆ పదవిని చేపట్టి ప్లానిటోరియం అభివృద్ధికి కృషి చేశారు. ప్లానిటోరియం ప్రదర్శనలలో అనేక వినూత్నమైన మార్పులు ప్రవేశపెట్టారు. ఈ మార్పుల వల్ల సందర్శకులు అధిక సంఖ్యలో వచ్చేవారు. ఈమె ఆస్ట్రోనామికల్ సొసైటీ ఆఫ్ ఇండియాలో మెంబర్. 2014లో ఆవిర్భవించిన పబ్లిక్ అవుట్ రీచ్ అండ్ ఎడ్యుకేషన్ కమిటీ (పిఓఈసీ)కి ఈమె మొట్టమొదటి చైర్‌పర్సన్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఈ కమిటీలో ఈమె టెలిస్కోప్‌లో గ్రహాల కదలికలు గమనించి వాటిని కంప్యూటరైజ్ చేసి ప్లానిటోరియం మాజీ దర్శకులు శక్తి సిన్హాకు మరియు ప్లానిటోరియం లైబ్రరీకి అందించేవారు. ఖగోళశాస్త్ర విజ్ఞానాన్ని యువతకు, బాలలకు అనేక కొత్త రీతుల్లో తెలిపేందుకు ఎంతో శ్రమపడి అత్యంత విలువైన కార్యక్రమాలు రూపొందించి ప్రోత్సహించేవారు. ఈ కార్యక్రమాలన్నీ ఆర్కియాలజీ సర్వే ఆఫ్ ఇండియాలో కమ్యూనికేట్ చేసేవారు. ఆర్కియాలజీలకి ఈమె ఎన్నో ప్రాజెక్టులు అందించారు. అనేక ప్రాజెక్టులలో ఈమె అనర్గళంగా ఉపన్యసించడంలో కీలకపాత్ర పోషించారని శక్తిసిన్హా తమ సంతాపంలో తెలిపారు. శక్తి సిన్హా డాక్టర్ రత్నశ్రీగారితో 2016 నుంచి 2019 వరకు కలిసి పని చేశారు.**

**'ఆస్ట్రో అడ్డా' అనే ఆన్‌లైన్ డిస్కషన్ ఫోరం మొట్టమొదటిగా ప్రారంభించారు రత్నశ్రీగారు. ఈ ఫోరంలో ప్రతి 15 రోజులకొకసారి విద్యార్థులతో ఈమె గ్రహాల కదలికలపై చర్చాగోష్టిలో పాల్గొనేవారు. మనదేశంలోని ఆస్ట్రానమీ కమ్యూనికేటర్స్ అందరికీ ఈమె ప్రేరణగా నిలిచారు. ఖగోళవిజ్ఞాన శాస్త్రంలో డిగ్రీ, పీజీ చేసేవారంతా ఈమె వద్దకొచ్చి ఈమె నుంచి ఎంతో విజ్ఞానాన్ని పొందారు. యువతకు తన విజ్ఞానాన్ని పంచడంలో** →

**ఆమె చాలా ఆనందం అనుభవించేవారు. ఢిల్లీలోని జంతర్‌మంతర్ సంరక్షణకు ఈమె పడిన తపన అసామాన్యం. జంతర్‌మంతర్ పరిశుభ్రతకు, పరరక్షణకు విద్యార్థులతో కలిసి తానూ పాలుపంచుకున్నారు. పరికరాలు, పోస్టర్లు, లీఫ్‌లెట్స్, విద్యార్థుల కార్యాచరణ కరపత్రాల ద్వారా ఆస్ట్రానామికల్ పరికరాలు ఏ విధంగా పని చేస్తాయో తెలిసేలా ఢిల్లీ, జైపూర్‌లలో ఈమె తయారు చేయించారు. వీటన్నిటి గురించి ఈమె అంతర్జాతీయ సభలలో తెలిపేవారు. ఆర్కియాలజీ సర్వే ఆఫ్ ఇండియా ఆమెను 'ఓవర్ సీయింగ్ రెస్టోరేషన్ ఆఫ్ జంతర్ మంతర్ ఇన్ ఢిల్లీ'గా నియమించుకున్నారు.**

**నేషనల్ కౌన్సిల్ ఆఫ్ సైన్సు మ్యూజియంలో జరిగే కార్యక్రమాలు, మరియు ఎగ్జిబిషన్లలో రత్నశ్రీగారు సలహాదారుగా వ్యవహరించారు. ఈమె ఎన్‌సీఈఆర్‌టి 6వ తరగతి టెక్స్ట్ బుక్‌కు ఎడిటర్‌గా పని చేశారు.** ఖగోళ విజ్ఞానశాస్త్ర విలేఖరులు ఈమె వద్ద తాము గ్రహాంతరాలలో జరిగే ఘటనల గురించి పుస్తకాలలో రాయాలంటే రత్నశ్రీగారి సలహాలు తీసుకునేవారు. వారికి అతి తేలికైన పద్ధతుల్లో ఆమె వివరంగా తెలిపేవారు. 2018, 2019 మహాత్మాగాంధీ 150వ జయంతి సంవత్సర సందర్భంగా ఈమె ఒక క్యాంపెయిన్ నిర్వహించారు. దానిపేరు బాపూ ఖగోళమేళా.

గాంధీ సంచరించిన ప్రాంతాలకు రత్నశ్రీ, ఆమె బృందం వెళ్లి కార్యక్రమాలు నిర్వహించారు. కరోనా మహమ్మారి సమయంలో కూడా రత్నశ్రీగారు ఎంతో సమన్వయంతో సమయం వృథా కాకూడదని, ఆన్‌లైన్ వర్క్‌షాప్‌లు, చర్చలు, ఉపన్యాసాలు నిర్వహించారు. ఒక మహిళ ఇంతటి ఉన్నత స్థానానికి ఎదగడానికి అవసరమైన ప్రోత్సాహాలన్నీ రత్నశ్రీ గారికి తమ కుటుంబ సభ్యుల ద్వారా సంపూర్ణంగా లభించాయి. కుమారుడు, కోడలు, భర్త మనమరాలు ఉన్న చిన్న కుటుంబం ఆమెది.

ఇంతటి విజయవంతమైన జీవితాన్ని అందుకున్న శ్రీమతి రత్నశ్రీగారు కరోనా బారిన పడి 2021 మే 9న మరణించారు. ఇంతటి ఉన్నత స్థాయికి ఎదిరిగన రత్నశ్రీ మహిళా మహిళా లోకానికే ఆదర్శం. ఎదగాలంటే లక్ష్యం నిర్ధేశించుకోవాలని అందరికీ దిశానిర్ధేశం చేసి తను తరలిపోయింది.

ఈమె చైతన్య మానవికి ఎన్నో విజ్ఞానవంతమైన వ్యాసాలు అందించిన కె.నాగమణి గారి సోదరి. శాస్త్రపురోభివృద్ధికీ, భావితరం అభివృద్ధికీ పాటుపడిన ఈమె జీవితం యువ మహిళా శాస్త్రవేత్తలకు ప్రేరణ కలిగిస్తోంది. వీరికి ఐద్వా ఘన నివళి అర్పిస్తోంది. ◆

# ఆత్మవిశ్వాసానికి ప్రతిరూపం 'ఆమె'

మగ పిల్లాడే కావాలన్న అత్తింటి వారి ఒత్తిడితో ఏడుగురు ఆడపిల్లలకు ఆమె తల్లి అయింది. పిల్లల చిన్న వయస్సులోనే భర్త కన్ను మూశాడు. అప్పటి నుంచి ఒంటరి పోరాటాన్ని మొదలు పెట్టింది. భర్త వ్యాపారాన్ని అందిపుచ్చుకుంది. అనేక ఆటంకాలను అధిగమిస్తూ పిల్లలను తీర్చిదిద్దింది. ఈ పోరాటంలో అమ్మకు సహాయం ఈ సప్త లక్ష్ములే. ఆ అమ్మే భగవతి. ఆడపిల్లలకు చదువు అవసరం లేదు. అత్తింట్లో మంచి కోడలిగా మెగలడం ఎలాగో తెలిసి ఉంటే చాలు అనే కట్టుబాట్లున్న కుటుంబం భగవతి పుట్టిల్లు. అజ్మీర్‌కు చెందిన ఆమె 8వ తరగతి వరకూ చదువుకుంది. జోధ్‌పూర్‌కు చెందిన మోహన్‌లాల్‌తో 22 ఏళ్లకు పెళ్లయింది. తొమ్మిది మంది అన్నదమ్ములు, 30 మంది సభ్యులుండే ఉమ్మడి కుటుంబంలోకి అడుగు పెట్టిందామె. ఆడపిల్ల పుట్టిన ప్రతిసారీ మగపిల్లాడూ కావాలంటూ వేధించేవారు. చూస్తుండగానే ఏడుగురు ఆడపిల్లలు జన్మించారు. ఇంక పిల్లలు చాలని భర్తకు మొరపెట్టుకుందామె. ఇంతమంది ఆడ పిల్లలను ఉమ్మడి కుటుంబంలో పోషించలేమని, మీరు వేరు కాపురం పెట్టండని అత్తమామలు చెప్పేశారు. భార్యాభర్తలు మసాలా దినుసుల వ్యాపారం చేసేవారు. ఒక్కపూటే తిందాం. పిల్లలను మాత్రం చదివిద్దామని మొరపెట్టుకుందామె. అంతా బాగా జరిగిపోతుందనే సమయంలో భర్త కన్నుమూశాడు. అనారోగ్యం భర్త చనిపోయిన మూడో రోజునే నేను వ్యాపారాన్ని కొనసాగిస్తానని అత్తింటివారితో చెప్పిందామె. ఆడవాళ్లు వ్యాపారం అంటూ బయట తిరిగితే పరువు పోతుందని విరుచుకుపడ్డారు. ఊరిపెద్దల వద్ద పంచాయతీ పెట్టి వ్యాపారం చూసుకుంటానని గట్టిగా చెప్పిందామె. నీతో మాకు ఎటువంటి సంబంధం లేదని అత్తింటి వారు తెగదెంపులు చేసుకుని షాపు తాళాలు చేతికిచ్చారు. పనిలోకి వెళ్లిన మొదటి రోజే గుసగుసలు వెక్కిరింపులు ఎదుర్కొన్నారు. నా దగ్గర పని చేయడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. అన్ని పనులూ నేనే చేసుకునేదాన్ని అనిచెప్పిందామె. కాస్త పిల్లలు ఎదిగి నాకు సహాయం చేశారు. అలా మా వ్యాపారం కొనసాగించి 4 కొత్త దుకాణాలు తెరిచాం. నాణ్యమైన మసాలా దినుసులు తెప్పించి విక్రయిస్తాం. ఇప్పుడు పిల్లలంతా పెద్ద పెద్ద ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. నలుగురి పెళ్లిళ్లు చేశా. ధైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని కూడ గట్టుకుంటే జీవితంలో గెలుపు సాధించొచ్చు అంటారీమె. ◆

-అల్లూరి మన్మోహిని

శ్రమశక్తే మానవ జాతి మనుగడకు మూలధనం. ఆ శ్రామికుల జీవితాలు గౌరవప్రదంగా సాగించాలని పశ్చిమ గోదావరి జిల్లా ఆకివీడు కార్మిక సంఘం, సీఐటీయూతో కలిసి సావిత్రమ్మ పయనించారు. ప్రజాతంత్ర ఉద్యమాల్లో సావిత్రమ్మ పాత్రను స్మరిస్తూ కొన్ని సందర్భాలు.. సంఘటనలు..

## శ్రామికశక్తికి ప్రతీక

# సావిత్రమ్మ



సావిత్రమ్మగారి పుట్టినిల్లు కృష్ణా జిల్లా. అత్తవారిల్లు నెల్లూరు. తల్లిదండ్రుల ద్వారా పశ్చిమగోదావరి జిల్లా ఆకివీడు ఆమెకు పరిచయం. కార్మిక సంఘం (అఖిల భారత కార్మిక సంఘాల సంస్థ) శ్రమజీవుల న్యాయమైన హక్కుల కోసం సాగించే ఆందోళనలకు, స్పందించిన **సావిత్రమ్మ కార్మిక సంఘంలో మమేకమై బలమైన పాత్ర నిర్వహించారు. ఆకివీడు ప్రాంతంలో బియ్యం మిల్లులు (రైస్ మిల్లులు) ఎక్కువ. వ్యక్తిగతంగా ఎదురైన విషాదాన్ని అధిగమించి మిల్లుల్లో పని చేసే కార్మికుల శక్తిని శ్రామికశక్తి విలువలను చాటిచెప్పిన వ్యక్తిత్వమే సావిత్రి.**

**తాను స్వయంగా మిల్లు కార్మికురాలిగా జీవించి మహిళా కార్మికులను చైతన్యపరుస్తూ కార్మికోద్యమంలో బహుముఖ పాత్ర నిర్వహించారు. కార్మిక నాయకురాలిగా పనిచేస్తూ కార్మికుల భార్యలందరినీ మహిళా ఉద్యమంలో ప్రోత్సహించారు.**

1981 ఆగస్టు 16, 17, 18 తేదీల్లో భీమవరంలోని డిఎన్ఆర్ (దంతులూరి నారాయణరాజ్) కళాశాలలో జరిగిన రాష్ట్ర ఉపాధ్యాయ మహాసభ పది వేల మంది ప్రతినిధులతో పెద్ద ఎత్తున జరిగింది. ఆ సందర్భంలో ఆకివీడు సిఐటియు కార్యకర్తలు సుశిక్షితులైన సైనికుల వలే వలంటీర్లుగా వచ్చి అత్యంత క్రమశిక్షణతో ఉపాధ్యాయ మహాసభకు పలుసేవలు అందించి సభను జయప్రదం చేశారు. వంటశాల నిర్వహణకు ఆకివీడు నుంచి 40 మంది మహిళా కార్యకర్తలు వచ్చి యంత్రాల వలే రాత్రింబవళ్లు కూరగాయలు తరుగుతూ భోజన ఏర్పాట్లతో సావిత్రమ్మ సాయకత్వాన అద్భుతంగా కృషి చేశారు.

**1987లో రాజస్థాన్‌లోని దేవరాల అనే గ్రామంలో రూప్‌కన్వర్ అనే 17 ఏళ్ల వివాహిత భర్త చనిపోతే ఆమెను భర్తతోపాటు సజీవ దహనం చేశారు. చట్టం ఉన్నా ఇప్పటికీ అక్కడ ఆ దురాచారం జరుగుతూనే ఉంది. ఈ ఆచారాన్ని ఖండిస్తూ దేశవ్యాప్తంగా మహిళా సంఘం పెద్ద ఎత్తున ఆందోళన చేస్తూ సభలు నిర్వహించి భారత ప్రధాని రాజీవ్‌గాంధీకి పోస్టుకార్డుల కార్యక్రమం సాగించింది. ఆ సందర్భంగా ఆకివీడులో మహిళా సంఘం సభకు రాష్ట్ర పౌరహక్కుల సంఘం అధ్యక్షులు డాక్టర్ విఠల్ హాజరయ్యారు. సభా కార్యక్రమానికి ముందు సభ జరిగే అవకాశం లేకుండా విపరీతమైన వర్షం. అప్పుడు సావిత్రమ్మ మహిళా దళంతో వీధుల్లో ఇంటింటికీ తిరుగుతూ వర్షమైనా అందరూ బయటకు రావాలి. సభ జరుగుతోంది రండీ అని అందరినీ సభాస్థలికి తీసుకొచ్చి సభను జయప్రదం చేశారు.**

మహిళా కార్యకర్తలు ఒక కార్యక్రమ సందర్భంగా భీమవరం బస్టాండ్‌లో బస్సుకోసం నిలుచున్నారు. అక్కడ పెద్దపెద్ద అశ్లీల సినిమా పోస్టర్లు చూశారు. వెంటనే అక్కడ ఉన్న బస్టాండ్ బాధ్యులతో సావిత్రమ్మ తక్షణమే ఆ పోస్టర్లను మీరు తొలగిస్తారా? లేదా ధర్నా చేయమంటారా? మా జిల్లా మహిళా సంఘం అంతా ధర్నాకు పిలుపిస్తాం. ఇటువంటి అశ్లీల చిత్రాలు పురుషులవి ఎందుకు లేవు?' అని వారిని తీవ్రంగా హెచ్చరిం చారు. వెంటనే బస్టాండ్ బాధ్యులు ఆ వాల్‌పోస్టర్లను తొలగించారు. న్యాయమైన సామాజిక ఉద్యమాల్లో ఆకవీడు మహిళా ఉద్యమంలో సావిత్రమ్మ చూపిన బహుముఖపాత్ర ఈనాటి యువ కార్యకర్తలకు మార్గదర్శకం.

**1985లో** జరిగిన ఎన్నికల్లో

→

**తెలంగాణలోని తుంగతుర్తి నియోజకవర్గంలో వీర తెలంగాణ యోధురాలు మహిళా ఉద్యమ నేత మల్లు స్వరాజ్యం పోటీ చేసిన సందర్భంలో శత్రుపక్షం కక్షతో స్వరాజ్యంపై పోటీపడినప్పుడు మన సావిత్రమ్మ మేము నెల రోజులు సూర్యాపేట ప్రాంతంలోనే ఉండి ఎన్నికల ప్రచారం చేశారు. ప్రజాసేవలో వ్యతిరేకుల పట్ల అత్యంత చాకచక్యంగా పనిచేసే ఆమె చతురత అద్భుతం.**

**సావిత్రమ్మ ఆకివీడు బియ్యం మిల్లులో పని చేసినప్పుడు ఆ మిల్లులోని కార్మికుల తీరని సమస్యలు ఎన్నెన్నో. యజమానులకు ఎన్ని విజ్ఞప్తులు చేసినా నిర్లక్ష్యం చేసిన సందర్భాల్లో సమ్మె చేసే పరిస్థితి వచ్చింది. సమ్మె అంటే సరదా కాదు. అది కార్మికవర్గానికి జీవన్మరణ పోరాటమే. సమ్మె సందర్భంలో వేతనాల్లేక ఆర్థిక బాధలతో నలిగిపోతున్నద తోటి మహిళా కార్మికులకు ధైర్యం చెబుతూ, వారిని చైతన్య పరుస్తూ జాతి మనుగడకు శ్రామికశక్తే మూలధనం అని ప్రభోదిస్తున్నారని మిల్లు యజమానులు కక్షతో సమ్మె ముగిశాక సావిత్రమ్మను మిల్లులో పనికి తీసుకోలేదు. అయినా సావిత్రమ్మ సీఐటియూ అండదండలతో నమ్మిన ఆశయంతో నిర్భయంగా మిల్లుకు దగ్గర్లోనే టీకొట్టు పెట్టుకొని ధైర్యంగా జీవించారు.**

అమెరికాకు దగ్గర్లో ఉన్న చిన్న సోషలిస్టు దేశం క్యూబా. ఆ దేశంలో వరి పండదు. చెరకు ఎక్కువ. అందుకని అక్కడ పంచదార ఎక్కువ ఉత్పత్తి అవుతుంది. సోవియట్ యూనియన్ పతనం తరువాత ప్రతి ఏడాదీ భారత దేశం నుంచి పదివేల క్వింటాళ్ల బియ్యం కొనుగోలు చేస్తుంది. క్యూబాపై కక్షతో అమెరికా క్యూబాకు బియ్యం పంపిణీ ఆపేయమని 1994లో భారత ప్రభుత్వాన్ని హెచ్చరించింది. అప్పటి భారత ప్రధాని పి.వి. నరసింహారావుగారి ప్రభుత్వం క్యూబాకు బియ్యం పంపడం ఆపేసింది. ఆ సందర్భంగా సీపీఐ(ఎం) కేంద్ర కమిటీ మనమే క్యూబాకు బియ్యం పంపుదామని నిర్ణయించి దేశ వ్యాప్తంగా పార్టీ శ్రేణులన్నీ కదిలి ఇంటింటికీ తిరిగి ప్రతి ఇంటికీ ఒక కేజీ చొప్పున బియ్యం సేకరించింది. ఈ బియ్యం సేకరణ ఒక్క రోజులోనే జరపాలని పార్టీ ప్రకటించింది. అత్యంత ఉత్సాహంతో ఆకివీడు మహిళా సంఘం 40మంది కార్యకర్తలు నాలుగు దళాలుగా విభజించుకుని సావిత్రమ్మ ఆధ్వర్యంలో ఒక్కరోజే 4 క్వింటాళ్ల బియ్యం సేకరించారు.

1989లో భీమవరం దగ్గరలోని వీరవాసరంలో మరుగుదొడ్ల సమస్యలపై జరిగిన ఉద్యమంలో జిల్లా అధ్యక్షురాలైన టి.ప్రభావతి, సావిత్రమ్మలపై పెత్తందార్లు కర్రలతో దాడులు చేశారు. ఇద్దరికీ దెబ్బలు తగిలాయి. ఏలూరు కలెక్టర్ ఆఫీసు నుంచి డీఆర్వో వెంకటేశ్వరరావు వచ్చి ఆ ఉద్యమానికి న్యాయం చేశారు.

ఆమె కుమారుడిని సోషలిస్టు వ్యవస్థ పట్ల ఎంతో ఆశతో, ఉత్సాహంతో లెనిన్ అని పిలుచుకునేవారు. అలా ఊరందరికీ లెనిన్ పేరే పరిచయం అయింది. అసలు పేరు రమణ. అతడు చిన్నప్పుడు కష్టాల్లో పెరిగినా, కష్టపడి చదువుకుని అభివృద్ధి చెందాడు. అతని భార్య అరుణ ఆ తల్లీకొడుకుల జీవితాల్లో వెలుగులు నింపుతూ బింధు, స్వాతి, శృతి అనే ముగ్గురు రత్నాలను అందించింది. ఎంతో ఉత్సాహంతో సాగే ఆ నిండు సంసారంలో పెద్ద విషాదం. కరోనా మహమ్మారి ఆ తల్లీకొడుకులిద్దరినీ ఒక్కసారిగా కబళించింది. 2021 మే 2న లెనిన్, మే5న సావిత్రమ్మ హైదరాబాద్ ఆస్పత్రిలో కన్నుమూశారు. సావిత్రమ్మ, కుమారుడి మరణానికి ఆ ఊరు మొత్తం తల్లడిల్లింది. ఆ చిన్నబిడ్డల భవితను తీర్చిదిద్దే బాధ్యత అరుణదైంది.

ఆకివీడు మహిళా ఉద్యమంలో ప్రధాన భాగస్వాములుగా సావిత్రమ్మ, సహచరులుగా కోడల లక్ష్మి, బొక్కా సత్యవతి, ఉదయ, లావణ్య, అల్లూరమ్మ, కృష్ణవేణి మొదలైన మహిళలు, మహిళా నాయకత్వం ప్రజాతంత్ర ఉద్యమాలలో ఆదర్శవంతమైన పాత్ర నిర్వహిస్తున్నారు.

సావిత్రమ్మ రాష్ట్ర కమిటీ సభ్యులుగా, జిల్లా మహిళా సంఘం అధ్యక్షులిగా, సీఐటియూ నాయకురాలిగా ఆదర్శసేవలు అందించారు. ఆకివీడు పంచాయతీ సమితి కో ఆప్షన్ సభ్యురాలిగా కూడా పని చేశారు. మరింత శక్తివంతంగా మహిళా ఉద్యమాన్ని అభివృద్ధి చేయడమే సావిత్రమ్మకు నివాళి. ◆



మహిళా ఉద్యమ నేత, స్వాతంత్ర్య సమరయోధురాలు, సామ్యవాద స్వాప్నిక
మానికొండ సూర్యావతి గారి శత జయంతి సందర్భంగా అభినందనలతో....

# THE ANAKAPALLY DIVISION POSTAL EMPLOYEES

CO-OP. CREDIT SOCIETY LTD., NO.B.1952

**ANAKAPALLY - 531 001. Estd 1989**

ఫోన్ : 08924 230050 (0)

అధ్యక్షులు : బి.నూకరాజు

ఉపాధ్యక్షులు : సి.శంకరరావు

కార్యదర్శి : వై.వీరభద్రం

ట్రెజరర్ : కె.కిరణ్ కుమార్

25A

# మహిళా హక్కుల నేత సూర్యావతి గారి
# శతజయంతి శుభాకాంక్షలతో....







**శ్రీ జి. హేరంబర రావు & రీనా దంపతులు**
అకౌంటెంట్ & సీనియర్ అసిస్టెంట్,
సాలూరు & నెలిమర్ల మున్సిపాలిటీలు

**శ్రీ రణధేవ్ రమేష్ గారు**
సబ్ - పోస్టు మాస్టర్, మరియు సిబ్బంది, సాలూరు


# మహిళా హక్కుల నేత సూర్యావతి గారి
# శతజయంతి శుభాకాంక్షలతో....








**శ్రీ డి. త్రినాధరావుగారు**
రెవిన్యూ ఇన్స్పెక్టర్, సాలూరు మున్సిపాలిటీ

**శ్రీమతి ఆర్. ఇందిర గారు**
పాంచాలి సూపర్వైజర్,
ఐ.సి.డి.ఎస్. పాచిపెంట ప్రాజెక్టు

25B

# మహిళా హక్కుల నేత సూర్యావతి గారి శతజయంతి శుభాకాంక్షలతో....

**శ్రీమతి గొల్లపల్లి సుగుణ మణిగారు**
సీనియర్ సహాయకులు
పాచిపెంట ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టు

**జి. నాగదుర్గ గారు** ఎస్.ఓ.
కస్తూరిభా గాంధీ బాలికల విధ్యాలయం
ఖరాసవలస, సాలూరు మండలం



**శ్రీమతి ఆర్. ధనలక్ష్మి గారు**
సూపర్‌వైజర్ దుగ్గేరు సెక్టార్
మక్కువ మండలం.

**శ్రీమతి టి. రమణమ్మగారు**
ఫస్ట్ సెక్టార్ సూపర్‌వైజర్,
సాలూరు అర్బన్ ప్రాజెక్టు

# మహిళా హక్కుల నేత సూర్యావతి గారి శతజయంతి శుభాకాంక్షలతో....







**శ్రీమతి పి. విజయలక్ష్మిగారు**
గ్రేడ్ 1 సూపర్‌వైజర్, కూర్మరాజుపేట.
ఐ.సి.డి.ఎస్, సాలూరు రూరల్ ప్రాజెక్టు

**శ్రీమతి కె. రత్నకుమారి గారు**
గ్రేడ్ 2 సూపర్‌వైజర్, బాగువలస
ఐ.సి.డి.ఎస్. సాలూరు రూరల్ ప్రాజెక్టు

25 C

# మహిళా హక్కుల నేత సూర్యావతి గారి శతజయంతి శుభాకాంక్షలతో....







**శ్రీమతి చుక్క అభిజ్ఞ గారు**

మెడికల్ ఆఫీసర్ & సిబ్బంది, బాగువలస పి.హెచ్.సి.

సాలూరు మండలం.

**శ్రీ ఎం. వి. జగదీష్ కుమార్ గారు**

మండల పశువైద్యాధికారి మరియు సిబ్బంది

పాచిపెంట మండలం

# మహిళా హక్కుల నేత సూర్యావతి గారి శతజయంతి శుభాకాంక్షలతో....







**శ్రీ షేక్ శుభానీ గారు**

మేస్త్రీ, శానిటరీ విభాగం,

సాలూరు పురపాలక సంఘం

**శ్రీ తుపాకుల రామస్వామి గారు (రాజా)**

మేస్త్రీ, శానిటరీ విభాగం,

సాలూరు పురపాలక సంఘం

25 D


117
నిరుపేదలు
172
సుస్థిర వృద్ధి సూచి,
జీవన ప్రమాణం


POSITIVITY! SAB CHANGA SI!
COVID DEATHS
BODIES FLOATING ON GANGA!
BODIES FOUND BURIED IN SAND


చదువుల్లో
వెనుకబడ్డ
తెలుగు రాష్ట్రాలు


కోర్టు
కేంద్రం
దేశంలో మొత్తం వలస కూలీలెందరు?
తెలియదు సార్!
ఎంతమందికి రేషన్ కార్డులిచ్చారు?
తెలియదు సార్!
వలస కూలీల్లో ఎవరికైనా కేంద్రం సాయం చేసిందా?
తెలియదు సార్!
అసలు వలస కూలీలంటే ఎవరో తెలుసా?
తెలియదు సార్!


కేంద్ర సాయం
అనాథలు
కేంద్రం


ఇంద తిను!
భారత్
2 టన్నుల కెన్యా
హారోత్పత్తులు

# మహిళా ఉద్యమ నిర్మాత

# సూర్యావతి



కృష్ణా జిల్లా గన్నవరం తాలూకా ఇందుపల్లి గ్రామంలో 1921లో సంపన్న కుటుంబంలో సూర్యావతిగారు జన్మించారు. ఆనాడు చిన్న వయస్సులోనే వివాహాలు జరిపించేవారు. సూర్యావతిగారికి కూడా 16 సంవత్సరాలకే మానికొండ సుబ్బారావు గారితో వివాహం జరిగింది. సూర్యావతి గారి బాల్యం, చదువు అంతా కాటూరు గ్రామంలో పినతండ్రి గారైన కడియాల గోపాలరావు గారింట్లో జరిగింది. జాతీయోద్యమం ముమ్మరంగా జరుగుతున్న కాలమది. కడియాల గోపాలరావుగారిల్లు యువతీ యువకులకు రాజకీయ విద్యాకేంద్రంగా ఉండేది. గోపాలరావుగారి ప్రోద్బలంతో కాటూరు గ్రామంలో మహిళలతో సమావేశం జరిగింది.

**ఉద్యమ ప్రవేశం :**

స్వాతంత్రోద్యమంలో మహిళలు పాల్గొనాలన్న మహాత్మాగాంధీ పిలుపు ద్వారా చైతన్యవంతులైన స్త్రీలు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. మహిళా సంఘాలు స్థాపించారు. అవి పట్టణాలకు, ఉన్నత వర్గాల మహిళలకే పరిమితమైనాయి. మహానేత పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు, కడియాల గోపాలరావుగార్ల ప్రోద్బలంతో 1936లో గ్రామీణ స్త్రీల సమస్యలను అధ్యయనం చేసి మహిళలను చైతన్యపరచే కార్యక్రమాలను నిర్వహించడానికి మహిళా సంఘం ఏర్పాటు చేయాలని సంకల్పించారు. 1936లో తూర్పు కృష్ణాలో 56 మంది సభ్యులతో మహిళా సంఘం ఏర్పడింది. తరువాత తూర్పు కృష్ణాలో జరిగిన మహాసభలో వల్లభనేని సీతామహాలక్ష్మి, చండ్ర సావిత్రిదేవి అధ్యక్ష, కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. ఆ తర్వాత కాలంలో సంఘం అనేక జిల్లాలకు విస్తరించింది. **1942లో కృష్ణా జిల్లా గరికపర్రులో జరిగిన మహాసభలో వల్లభనేని సీతామహాలక్ష్మి అధ్యక్షులుగా, సూర్యావతిగారు కార్యదర్శిగా ఎన్నికయ్యారు. స్త్రీలకు విద్యా సౌకర్యాలు కల్పించాలని, పురుషులతో పాటు సమాన కూలి ఇవ్వాలని, ఆస్తిహక్కు కల్పించాలని, మరుగు దొడ్లు, ప్రసూతి ఆసుపత్రులు కట్టించాలని మహాసభలో తీర్మానాలు చేసి బ్రిటిష్ ప్రభుత్వానికి పంపారు. ఆ తరువాతి కాలంలో వాటి సాధనకు అనేక ఉద్యమాలు జరిగాయి.**

**ఆనాటి సాంఘిక పరిస్థితులు:**

ఫ్యూడల్ ధోరణులతో స్త్రీలకు ఎలాంటి అవకాశాలు ఉండేవి కావు. చదువుకున్న స్త్రీ చెడిపోతుందనే భావం బలంగా ఉండేది.

మధ్యతరగతి ఆడవాళ్ళు బయట పనులకు పోకూడదనే ఆంక్షలు ఉండేవి. ఈ ఆంక్షలకు వ్యతిరేకంగా మహిళలను బయటకు తీసుకువచ్చి పొలం పనుల్లో ప్రోత్సహించేందుకు తాము కూడా స్వయంగా పాల్గొనేవారు.

**సామాజిక పరిస్థితులపై ఎదురీత :**

**మహిళా సంఘం విస్తరణకు కాలినడకన గ్రామ గ్రామాన పర్యటించారు. నేడున్న రవాణా సౌకర్యాలు ఆనాడు లేవు. స్త్రీలు గడపదాటి బయటకు రాకూడదనే సామాజిక కట్టుబాట్లు, ఆంక్షలు ఉన్న కాలంలో అనేక ఆటుపోట్లు ఎదుర్కొని, మొక్కవోని దీక్షతో మహిళా సంఘ నిర్మాణానికి ఆనాటి నాయకులు ఎంతగానో కృషి చేశారు.** సూర్యావతిగారితో పాటు నాగళ్ళ రాజేశ్వరమ్మ, చండ్ర సావిత్రి దేవి, వల్లభనేని సీతామహాలక్ష్మి, డా॥అచ్చమాంబ, కాట్రగడ్డ హనుమాయమ్మ మొదలైన వారు ఉన్నారు. స్వాతంత్ర్య పోరాటంలోనూ, తెలంగాణా సాయుధ పోరాటంలో అమరులైన కుటుంబాల నుండి మహిళలు ఉద్యమంలో ప్రధానపాత్ర వహించారు. ఉద్యమం రాష్ట్రంలో వివిధ జిల్లాలకు విస్తరించే క్రమంలో మోటూరు ఉదయం, మల్లు స్వరాజ్యం వంటి నేతలు ప్రముఖ పాత్ర పోషించారు.

**సంస్కరణోద్యమాలు :**

ఆనాటి సాంఘిక పరిస్థితుల్లో స్వాతంత్రోద్యమంలో పాల్గొంటూనే సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు నిర్వహించారు. సనాతన భావాలకు వ్యతిరేకంగా మహిళలను సంఘటిత పరిచి పోరాటాలు నిర్వహించటమేగాక ఆచరణలో చేసి చూపించారు. పెనమలూరు ఆశ్రమంలో ఒక వితంతువుకు వివాహం చేస్తుండగా ఆ ఊరు సనాతన వాదులు మా గ్రామాన్ని అపవిత్రం చేస్తారా అంటూ రౌడీలతో దాడి చేయించారు. దాడిచేసిన వారి వద్దకు వెళ్లి మేం చేసిన తప్పేమిటి? జీవితాంతం ఆమె వితంతువుగా ఎలా ఉండగలుగుతుంది? వివాహం చేసుకుంటే తప్పేమిటి? అని

ప్రశ్నించి వాళ్లను కూడా ఒప్పించారు. ఆనాడు యువజన సంఘం కార్యక్రమాలు కూడా బాగా నడిచేవి. యువకులు సంస్కరణ ఉద్యమాల్లో చురుగ్గా పాల్గొనేవారు. ఆదర్శ వివాహాలు చేసుకోవటానికి ముందుకు వచ్చేవారు.

మొద్దమొదటిసారిగా 1948లో సాహిత్యం ద్వారా మహిళల్లో అభ్యుదయ ప్రచారానికి 'ఆంధ్రవనిత' పత్రికను స్థాపించారు. అభ్యుదయ భావాలు ప్రజల్లోనికి ప్రచారం కాకూడదనే కారణంతో అప్పటి ప్రభుత్వం పత్రికను రద్దు చేసింది. స్త్రీలకు వారసత్వపు హక్కు కోసం ఉద్యమాలు నడిచాయి. స్త్రీ విద్య, భర్త ఆస్తిలో వాటా, సమాన పనికి సమాన వేతనం, బాల్యవివాహాల నిరోధక చట్టం, పుట్టింటి ఆస్తిలో మగపిల్లవాడితో సమాన హక్కు మహిళా సంఘాల ద్వారానే సాధించుకోగలిగాం.

**ప్రజాప్రతినిధిగా :**

**సూర్యావతిగారు 1950వ దశకంలోనే నందమూరు పంచాయితీ ఎన్నికల్లో మూడు సార్లు ప్రెసిడెంట్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 1958లో ఎం.ఎల్.సి.గా ఎన్నికై శాసన మండలిలో ప్రజా సమస్యలను ప్రస్తావించి వాటి పరిష్కారం కోసం కృషి చేశారు. 1987లో ఉంగుటూరు మండల అధ్యక్షురాలిగా ఎన్నికయ్యారు. గ్రామాల్లో మరుగుదొడ్ల సమస్య తీవ్రంగా ఉండేది. బుడమేరు వరద గ్రామాలను ముంపుకి గురి చేసేది. అలాంటి సమయాల్లో ప్రజలు పడుతున్న బాధలు చూసి ముంపు నివారణకు చర్యలు తీసుకోవటమేగాక దేశంలో ఎక్కడా లేని విధంగా 1,810 వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణం చేపట్టారు.** నిధుల కోసం అనారోగ్యాన్ని పక్కన పెట్టి హైద్రాబాద్‌కి అనేకమార్లు తిరిగి పట్టుదలతో నిధులు మంజూరు చేయించారు. తన పదవిని ఏనాడూ స్వంత ప్రయోజనాలకు కాకుండా నిస్వార్ధంగా ప్రజల సమస్యల పరిష్కారానికి అలుపెరగని కృషి చేశారు.

**నిర్బంధాలను సైతం లెక్కచేయక :**

**తెలంగాణా సాయుధ పోరాటం సందర్భంగానూ, 1964లో చైనాలో యుద్ధం జరిగినప్పుడు చంటి పిల్లల తల్లిగా ఉన్న సూర్యావతిగారిని పిల్లల నుండి విడదీసి భర్తతోపాటు జైలులో నిర్బంధించారు. 'ఆంధ్ర వనిత' పత్రికను నిషేధించినప్పుడు నిషేధానికి వ్యతిరేకంగా మహిళలు ఆందోళనకు పూనుకున్నప్పుడు లాఠీచార్జి చేసి, సూర్యావతి, అన్నే అనసూయ, మోటూరు ఉదయం, డాక్టర్ అచ్చమాంబ తదితర నాయకులతో సహా 70 మంది మహిళలను నందిగామ జైలులో నిర్బందించారు. నిర్బంధాన్ని సైతం ధైర్యంతో ఎదుర్కొన్నారు. 1936లో ఏర్పడిన సంఘం ఈనాడు దేశవ్యాప్తంగా శాఖోపశాఖలుగా 25 రాష్ట్రాలకు విస్తరించింది.**

1947లో ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నికై రాష్ట్రమంతటా అనేక జిల్లాల్లో సంఘ నిర్మాణానికి విస్తృతంగా కృషి చేశారు. చనిపోయేవరకూ రాష్ట్ర ఉపాధ్యక్షులుగా కొనసాగారు. 1942 నుండి 1988 వరకు కృష్ణాజిల్లా కార్యదర్శిగా, 1988 నుండి 1990 వరకూ జిల్లా అధ్యక్షురాలిగా సుదీర్ఘకాలం పనిచేశారు. రాష్ట్రంలో మహిళలపై హింస పెరుగుతోందని, కుటుంబ సమస్యలతో మహిళలు పడుతున్న బాధలు గమనించి 1990లో కృష్ణాజిల్లా మహిళా న్యాయసలహా కేంద్రాన్ని స్థాపించటంలో ఆమె పాత్ర మరువలేనిది. నెల్లూరు జిల్లాలో జరిగిన సారా వ్యతిరేక ఉద్యమం రాష్ట్రవ్యాపిత ఉద్యమంగా తీర్చిదిద్దటంలో సూర్యావతిగారు కీలకపాత్ర పోషించారు. కృష్ణాజిల్లా సారా వ్యతిరేక పోరాట కమిటీని వేసి అన్ని మహిళా సంఘాలను, స్వచ్ఛంధ సంస్థలను ఐక్యం చేసి పెద్ద ఎత్తున పోరాటాలు నిర్వహించారు.

**నేనెరిగిన మానికొండ సూర్యావతి:**

1975లో ఆనాటి ప్రధాని ఇందిరా గాంధీ దేశంలో అత్యవసర పరిస్థితి విధించింది. ఆ సమయంలో తిరువూరులో జరిగిన మహిళల జనరల్‌బాడీ సమావేశానికి సూర్యావతిగారు హాజరయ్యారు. ఆమె ప్రసంగం మొదటిసారిగా విన్నాను. ఆ తర్వాత కాలంలో 1977 నుండి 1993 జూలై 4 చనిపోయే వరకూ మహిళా ఉద్యమంలో ఆమెతో కలిసి పనిచేసే సదవకాశం నాకు లభించింది.

ఆమె నిరాడంబరత, క్రమశిక్షణ, ఆశయానికి అంకితమై పనిచేయడంలో ఆమెను మించిన వారులేరు. కార్యకర్తల యెడల ప్రత్యేక శ్రద్ధ చూపేవారు. ఉన్న పొరపాటు ధోరణులను సరిదిద్దుకునేటట్లుగా సున్నితంగా చెప్పేవారు. ఆమె నిబద్ధత, నిర్మాణ సూత్రాలకు కట్టుబడి ఉన్న పద్ధతులతో మహిళా సంఘ నాయకురాలిగానే గాక సీపీఎం రాష్ట్ర కమిటీ సభ్యురాలిగా, వామపక్ష రాజకీయాల్లో రాణించారు.

**1993 జూలై 4వ తేదీన 41** ప్రజా సంఘాల రాష్ట్ర సదస్సులో మానికొండ సూర్యావతిగారు ప్రసంగిస్తూ **"పరాయిదేశ పరిపాలనకు వ్యతిరేకంగా స్వాతంత్ర్యం కోసం పోరాడాం. ఆ స్వాతంత్ర్యం పేరుతో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం** మన దేశ **సంపదను** పరాయి **ప్రభుత్వాలకు తాకట్టు పెడుతోంది. ఈ విధానాలకు వ్యతిరేకంగా అన్ని తరగతుల ప్రజలు మరో సంగ్రామాన్ని నిర్వహించాలి"** అని **పిలుపునిచ్చారు.**

అదే ఆమె చివరి ప్రసంగం. సభ తర్వాత సుందరయ్య విజ్ఞాన కేంద్రానికి వచ్చి జోయా గారితో కలిసి కుమార్తె వాణి ఇంటికి వెళ్ళారు. అక్కడే గుండెపోటుతో మరణించారు. ఆమె అడుగుజాడలలో నిబద్ధతతో కృషి చేయటమే మనం ఆమెకు ఇచ్చే నివాళులు. ◆



# ప్రజాతంత్ర ఉద్యమాలలో అరుణతార సత్యవతి

**కామ్రేడ్ సత్యవతి 1965 ఏప్రిల్ 9న భీమవరం మండలం వెంప గ్రామంలో కోడె సత్యనారాయణ, గున్నమ్మ దంపతులకు రెండవ సంతానంగా జన్మించారు. స్వతహాగా రైతు కుటుంబంలో జన్మించిన సత్యవతి చిన్ననాటినుండి వ్యవసాయంలో తండ్రికి చేదోడు వాదోడుగా ఉండేవారు. సామాజిక ఉద్యమాలలో ఆది దంపతులుగా సత్యవతి, సత్యనారాయణ దాంపత్యం ఈనాటి యువతకు మార్గదర్శకం.**

వివాహానంతరం సత్యవతి 1983 నుండి డి.వై.ఎఫ్.ఐ(యువజన సంఘం)లో చురుకైన కార్యకర్తగా పనిచేశారు. భర్త ప్రోత్సాహంతో యువజన మహిళల సమస్యలపై పోరాడి అనేక సేవా కార్యక్రమాల్లో పాల్గొన్నారు. సత్యవతి మహిళా సంఘం (ఐద్వా), సీఐటియు, సాగించిన అన్ని ఉద్యమాలలోనూ పాల్గొనడానికి, అత్యంత ఉత్సాహంతో సర్వ సిద్ధంగా ముందుండేవారు. సత్యవతికి, ముగ్గురు బిడ్డలు. కృష్ణవేణి, ఝాన్సీ, కొడుకు వర్మ. ఝాన్సీ పుట్టుకతోనే దివ్యాంగురాలు. తన పరిస్థితి ఏమిటో తనకే తెలియని స్థితి. ఆ స్థితిలో కన్నబిడ్డతో యాతన పడుతూ బిడ్డను కాపాడుకుంటూనే, ప్రజాసేవే తన ఊపిరిగా, మహిళా సంఘమే తనకు పెద్ద ప్రాణంగా సంఘం కార్యక్రమాలలో ముందుండేవారు.

ఆకివీడులో నిత్య కార్యక్రమంగా సాగిన ఇళ్ల స్థలాల పోరాటంలో ప్రభుత్వ భూమిలో, 3200 మందికి పట్టాలు సాధించిన పోరాటంలో అనేక పర్యాయాలు అరెస్టు చేయబడింది. సత్యవతి సైనికురాలి వలే పని చేసింది.

2001లో ప్రభుత్వ వెలుగు పథకంలో 5, 6 నెలలు ప్రతిరోజూ పోరాటం సాగించిన ఫలితంగా 200 మందికి రేషన్ కార్డులు సాధించింది. మంచినీటి ట్యాప్ కనెక్షన్లకు 30 వేల రూపాయలు ప్రభుత్వం వసూలు చేస్తుంటే మహిళా సంఘం నిత్య కార్యక్రమంగా ఖాళీ బిందెలతో ఉద్యమించిన ఫలితంగా 10 వేల రూపాయలకు తగ్గించి 1500 ఇళ్లకు మంచినీటి కనెక్షన్లు సాధించింది.

-మద్యపాన నిషేధంకై జరిగిన ఉద్యమంలో సావిత్రమ్మతోపాటు బ్రాందీషాపులపై విరుచుకుపడ్డారు. బెల్టు షాపుల రద్దుకై, నివాస ప్రాంతాల్లో మద్యం షాపులకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున జరిగిన ఉద్యమాల్లో మహిళలను సంఘటితపరచి అనేక పోరాటాలను నిర్వహించారు.

- 2003లో ఆహార భద్రతా ఉద్యమంలో ఆకివీడు ఎఫ్‌సిఐ గోడౌన్లమీద సాగిన అత్యంత ప్రతిభావంతమైన మహిళా ఉద్యమ పోరాటంలో మహిళలు ఆదిశక్తులుగా తమ ప్రతిభనుచాటారు. ఆ సందర్భంగా సత్యవతి అత్యంత సాహసంతో గోడౌన్ల మెయిన్ గేటుపై సాహసంగా ఎగబాకింది. తల్లిని మించిన తనయుడుగా సత్యవతి కుమారుడు వర్మ ప్రజా పోరాటాల్లో అన్నిటికీ తెగించి నిలిచిన సంఘటనలు అనేకం.

- ప్రజాతంత్ర ఉద్యమాలలో ఆకివీడు మహిళా ఉద్యమం భీమవరం డివిజన్‌కే తలమానికంగా నిలిచింది. నిరంతర ప్రజల నిత్యజీవిత సమస్యల పరిష్కారం కోసం సాగిన కృషి సాధించిన ఫలితాల మూలంగా ఆ ఏరియాలో ప్రజాతంత్ర ఉద్యమం

→

బలపడింది.

- ఆకివీడులో మహిళా సంఘం బాలవిద్యార్థులను ప్రోత్సహించి 2001, 2002 సంవత్సరాల్లో వచ్చిన భూకంపాల సందర్భంగా అక్కడి బాలల సహాయ నిధుల సేకరణ ఆదర్శవంతంగా జరిగింది.
- 2004లో అండమాన్‌లో వచ్చిన సునామీ వల్ల, 2005లో కాశ్మీర్ పాకిస్తాన్ భూకంపాలలో అనాథలైన అక్కడి బాలల సహాయం కోసం బాల సంఘం ఏర్పరచి విరాళాలు పంపిన మహిళా ఉద్యమంలో సత్యవతి కృషి ఆదర్శం. సామాజిక సేవే జీవిత పరమార్థంగా జీవించిన, తనకు ఎంతో ప్రోత్సాహం అందించిన భర్త అనారోగ్యం సమయంలో తనను తాను మరచి సేవలు చేసి ఆయనను సత్యవతమ్మ కాపాడుకున్నారు.

ఇంట్లో భర్తకు, బిడ్డకు ఎంతగా సేవ చేస్తున్నా సామాజిక స్పృహను వీడలేని చైతన్యం ఆమెది. ఎన్నో ప్రజా పోరాటాలతో జీవితం పునీతం చేసుకున్న సత్యవతమ్మ చివరకు కరోనా మహమ్మారితో పోరాడి ఓడిపోయారు. ఏలూరు ప్రభుత్వ ఆస్పత్రిలో కోడలు క్రిష్ణవేణి, కొడుకు వర్మల వద్ద సెలవు తీసుకొని 2021 జూన్ 4న ఏలూరులో కన్నుమూశారు. మన భావితరం బంగారు భవితకు ప్రజాతంత్ర ఉద్యమం, దోపిడీ వ్యవస్థ నిర్మూలన కోసం మరింత శక్తివంతంగా, సత్యవతిగారే స్ఫూర్తిగా ప్రజాచైతన్యం కోసం దీక్షలో నిరం తరం విస్తరించగలదని ఆశిస్తూ. ◆

# తొమ్మిదూళ్ల వెలుగు భాగ్యశ్రీ

కుర్మాఘర్ అంటే నెలసరి వేళ ప్రత్యేకంగా ఆశ్రయమిచ్చే ఇల్లు. స్త్రీల ఆరోగ్యాన్ని కాపాడేందుకు వీటిని ఆధునికీకరించి అందుబాటులోకి తెచ్చుకుంది 19 ఏళ్ల భాగ్యశ్రీ. దట్టమైన అడవుల మధ్య బయట ప్రపంచానికి తెలియని తమ గ్రామాలకు ఎన్నో సదుపాయాలను వరంగా అందించి మంచి సర్పంచి అనిపించుకుంది.

మూడేళ్ల క్రితం ఛత్తీస్‌ఘడ్‌లోని గడ్చిరోలి జిల్లాలో సర్పంచి ఎన్నికలు జరపాలని నిర్ణయించినప్పుడు ఆ ప్రాంతం నక్సల్ ప్రభావితం కావడంతో ఎవరూ ముందుకు రాలేదు. ఆ సమయంలో ఈమె సర్పంచిగా ఎన్నికై తమ గ్రామానికి వస్తే ఎంతో మేలు జరుగుతుందని నిర్ణయించి ఊరంతా ఉమ్మడిగా నిర్ణయం తీసుకున్నారు. ఆమెను సర్పంచిని చేశారు. భాగ్యశ్రీ వారి నమ్మకాన్ని వృథా కానీయలేదు. స్థానిక మహిళలు, ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు పరిష్కరించడానికి ఇదే సరైన మార్గం అనుకుంది. 19 ఏళ్ల వయస్సులో సర్పంచి పదవి చేపట్టిన మొట్టమొదటి మహిళ ఈమె. ఈమె తండ్రి జిల్లా పరిషత్ పాఠశాలలో ఉపాధ్యాయుడు. తను దాచుకున్న ధనంతో ఈమె గ్రామంలోని యువతులకు శానిటరీ ప్యాడ్స్ కొని అందించేది. మహిళలకు చదువుతోపాటు శారీరక సామర్థ్యం, ఆరోగ్యం అవసరమని, వాటికి ప్రాధాన్యత ఇవ్వాలని భావించే ఈమె ఫిజికల్ ఎడ్యుకేషన్‌లో డిగ్రీ చేసింది. ఈమె దృష్టికొచ్చిన సమస్యల్లో మొదటిది.. నెలసరి సమస్య. ఆ సమయంలో మహిళలు ఇంట్లో ఉంటే ఆ కుటుంబానికి కీడు జరుగుతుందనేది అక్కడి మహిళల నమ్మకం. అందుకే ఆ మహిళలను ఐదు రోజులుపాటు గ్రామ శివారుల్లో ఉండే కుర్మాఘర్‌కు పంపుతారు. అక్కడ 5 రోజులు ఉంటారు వారు. అక్కడ పాములు, పురుగులు వంటి అనేక ప్రమాదకరమైన పరిస్థితులుండేవి. భద్రత లేదు. ఈమె సర్పంచి అయ్యాక ఆ కుర్మాఘర్‌లను సౌకర్యవంతంగా మార్చింది. మహిళలకు అనారోగ్యాలు, రొమ్ము క్యాన్సర్, నెలసరి సమయంలో శుభ్రత పాటించకపోతే వచ్చే అనారోగ్యాల గురించి వీడియోల ద్వారా అవగాహన కల్పించింది. అనారోగ్య సంకేతాలుంటే తనతో సంప్రదించమని చెబుతుంది. వారిని ప్రభుత్వ ఆస్పత్రిలో చేర్పి చికిత్స అందేలా చేస్తుంది.

తాగునీరు చాలా దూరం నుంచి వారు మోసుకొని తెచ్చుకునేవారు. ఇప్పుడు ఆ కష్టం లేకుండా ఆమె బావులు తవ్వించింది. మహిళల ఆరోగ్యం బాగుంటేనే కుటుంబ ఆరోగ్యం, సమాజం బాగుంటుందని నమ్ముతుందీమె. రోజూ తన పరిధిలోని 9 గ్రామాలకు బైక్‌పై తిరుగుతుందామె. వారం వారం సభలు ఏర్పాటు చేసి వారి సమస్యలు చర్చిస్తుంది. వైద్య సౌకర్యం, విద్యుత్, అందరికీ విద్య అందేలా ఆమె శక్తివంచన లేకుండా కృషి చేస్తుంది. అందుకే ఈమె 9 ఊళ్లకు వెలుగైంది. ◆

# శాస్త్రీయ విజ్ఞానం - అవగాహన

మొదటివేవ్‌లో కూడా కరోనాకు నాటు వైద్యం చేసుకుని వచ్చిన వారున్నారు. మనదేశంలో ఇది అసలు వింత కానేకాదు. నాటువైద్యం చేసుకుని వచ్చే రోగులను డాక్టర్లు ప్రతిరోజూ చూస్తూనే ఉంటారు. ఈ రోజుకీ జ్వరాలు వచ్చినా మరే ఇతర జబ్బు వచ్చినా రోగి మూత్రంలో బియ్యం వేసి అవి పసుపుగా మారితే జాండీస్ (పసరికలు) అని తెల్లగా అలాగే ఉంటే వైట్ జాండీస్ (తెల్ల పసరికలు)అని పేరు పెట్టి మందు ఇస్తూ ఉంటారు. అయితే అది కరెక్ట్ రోగనిర్ధారణ కాదు కాబట్టి అటువంటి నాటు మందులతో కిడ్నీలు లివర్లు పాడైపోతాయి. ఏ మందైనా అది నాటుమందా లేక మరోమందా అనేదానితో సంబంధం లేకుండా.. ఏ మందైనా పని చేయాలంటే అది సరైన మోతాదులో సరైన సమయంలో ఇవ్వాలి. ఏ మందైనా కెమికల్. నాటు మందైనా అందులో ఉండే కెమికల్ పదార్థంవలననే పని చేస్తుంది.

ఏ కెమికల్ పదార్థం కూడా దాని ప్యూర్ ఫాంలో ఉండదు. అనేక లవణాలతో అనుసంధానమై ఉంటుంది. ఈ లవణాలు ఆ కెమికల్ ని పని చేయకుండా చేయవచ్చు లేదా లవణాలు ఇతర రోగాల కారణం కావచ్చు. **ల్యాబ్‌లలో సైంటిస్టులు చేసే పని ఇదే. ఆ కెమికల్ స్ట్రక్చర్ ఏమిటి. దాని లక్షణాలు ఏమిటి? దానికి మరో అణువు కలిపితే దాని లక్షణాలు ఎలా మార్పు చెందుతాయి అని పరిశీలిస్తారు. దానిని పరిశుద్ధ రూపం బయటకు తీయడానికి ప్రయత్నిస్తారు.**

ప్రతి కెమికల్ దాని విలక్షణతను దాని రూపంలో దాచుకుంటుంది. దీనిని మనం ఐసోమెరిజం అంటాం. ఉదాహరణకు స్పేషియల్ ఐసోమెరిజం. ఒక కెమికల్‌ను ఒక రకంగా నిలబెడితే ఒక లక్షణం దానిని ఉల్టాగా అంటే కుడి ఎడమలుగా నిలబెడితే మరో లక్షణాన్ని కలిగి ఉంటుంది.

ఉదాహరణకు సిట్రిజిన్ మాత్ర **తీసుకుందాం. ఇది వేసుకుంటే జలుబు తగ్గుతుంది. దానితో పాటు నిద్రకూడా విపరీతంగా వస్తుంది. శరీరంలో నిస్సత్తువ వస్తుంది. దీనిని ఎలా పోగొట్టాలి?. శాస్త్రవేత్తలు ఎన్నో పరిశోధనలు చేసి చివరకు దానిలో కుడి వైపుకు తిరిగి ఉన్న భాగాన్ని తీసేశారు. ఎడమ వైపుకు తిరిగి ఉన్న దానిని మాత్రమే ఉంచి చూశారు. సిట్రిజిన్ కాస్తా లీవో సిట్రిజిన్ అయింది. ఆశ్చర్యంగా ఇది కూడా జలుబును తగ్గించింది కానీ అదే విధంగా అంతగా నిద్రను కలిగించడం లేదు. కేవలం కుడి భాగాన్ని తీసేసి ఎడమభాగంగా ఉంచేస్తే ఆ కెమికల్ లక్షణం అంతగా మారింది. దీనినే పదార్థ విజ్ఞానం అంటారు. పదార్థ విజ్ఞానం మానవునికి అతి పురాతనమైనది. ఈ రోజుకూ అది కొత్త పరికరాలతో మరింతగా దూసుకుపోతోంది. అణువునే కాక అణువులోపల కూడా ఏముందో చూడగలిగేంత సూక్ష్మతను అది సంతరించుకుంది. గ్రాస్ నుంచి మైక్రో, నానో టెక్నాలజీ వరకు దూసుకుపోయింది.**

అసలు మానవ శరీర కణంలో కనిపించదు. ఆర్ఎన్ఏ అనుకుంటే అదే ఆర్ ఎన్ ఏ సహాయంతో వాక్సిన్ చేయగలిగేంత విజ్ఞానం పెంపొందింది. **ఐతే నాటు వైద్యాలలో ఇంతటి లోతైన పదార్థ విజ్ఞానం లేకపోవడం వలన అవి అనేక ఇంప్యూరిటీస్‌ని కలిగి ఉంటాయి. వాటిని శరీరం కనుక జీర్ణించుకుంటే శరీరమే వాటిని క్లియర్ చేసుకోవాలి. ఎందుకంటే శరీరంలోకి ఏ కెమికల్ వచ్చినా దానిని రద్దు చేయాల్సింది లివరు. దానిని మూత్రంద్వారా బయటకు**



**పంపవలసింది కిడ్నీ. ఈ రెండింటి మీద విపరీతమైన వత్తిడి పెరుగుతుంది. అందుకే నాటు వైద్యాల ద్వారా లివరు కిడ్నీ చెడిపోయిన వారు మన దేశంలో ఎక్కువ.**

కలోనియల్ ఇండియాలో పనిచేసిన గొప్ప డాక్టర్, శీలా షెర్లాక్ గారు గాస్ట్రో ఎంటరాలజీలో గొప్ప పరిశోధనలు చేశారు. ఆమె రాసిన టెక్స్ట్ బుక్ ఈ రోజుకీ గాస్ట్రో ఎంటరాలజి సూపర్ స్పెషలిస్టులు చదువుకుంటున్నారు. ఆమె ప్రత్యేకంగా భారతదేశ నాటు వైద్యం- లివరుపై వాటి ప్రభావాల గురించి పరిశోధన చేశారు. అవన్నీ ఆ టెక్స్ట్ బుక్ లో వివరించబడి ఉంటాయి.

కాబట్టి ఎమోషనల్ గా మాట్లాడటం వేరు. సశాస్త్రీయంగా మాట్లాడటం వేరు. చంద్రుడిపైకి పంపిన మొదటి రాకెట్‌లో ఉపయోగించిన టెక్నాలజీ కంటే ఈ రోజు మన చేతిలో ఉండే సెల్ఫోన్‌లో టెక్నాలజీ పదింతలు ఎక్కువ ఉంటుంది. ఈ టెక్నాలజీతో మన ఆలోచనలు ఏమైనా మారాయా? అదే ఎమోషనల్ బీయింగ్‌గా ఉండిపోతున్నాం. **నాటు పసరు వైద్యాలలో ఉండేటువంటిని మంచిని బయటకు తీయాల్సిందే. దానికి ఎమోషన్ కాదు కావలసింది. శాస్త్రీయ దృక్పథం. మందులు ఉన్నాయి. వాటిని శాస్త్రీయంగా చదవగలిగే విజ్ఞానం కావాలి. ఆ దృక్పథం ఉండాలి. ఒకరి మీద ద్వేషంతో అక్కసుతో** వచ్చేది కాదు విజ్ఞానం. ◆

మానికొండ విజయవాణి (పెద్ద కుమార్తె)

# నా జ్ఞాపకాలలో.. అమ్మ..!

*అందరికీ అమ్మంటే అమృతమయి. నాకు మాత్రం అమ్మంటే ఓ ధైర్యం. అమ్మంటే చైతన్యం. అమ్మ.. ప్రేమా, అప్యాయతను పంచే మంచి మనిషి. స్నేహం, సౌశీల్యం, ధైర్యం, సాహసం అన్ని కలబోసిన మహా మనిషి. అలాంటి మా అమ్మ గురించి రాసే సాహసం ఇంత వరకు చెయ్యలేదు. రాయాలని చాలాసార్లు అనిపించినా, సాహసించ లేకపోయాను. అంత వున్నతమైన మనిషి గురించి నేను రాయగలనా అని సందేహం ఉండేది. అమ్మ పుట్టి వందేళ్ల సందర్భంగా నా జ్ఞాపకాలను మీ అందరితో పంచుకుంటున్నాను.*



నేను అమ్మతో గడిపిన కాలం చాలా స్వల్పం. ఎందుకంటే, నేను, చెల్లి రమ పుట్టిన దగ్గర నుండి మా మేనత్త దమయంతి దగ్గర కాసరనేనివారి పాలెంలో పెరిగాం. మా నాన్న, అత్తయ్య అక్కచెల్లెళ్ళ పిల్లలు. అయినా సొంత అన్నా చెల్లెళ్ళ వలే ఎంతో అప్యాయంగా ఉండేవారు. అన్నా, వదిన (మానాన్న మానికొండ సుబ్బారావు, అమ్మ సూర్యావతి) సమాజసేవకి అంకితమయ్యారని వారికి ఇబ్బంది లేకుండా, అత్తయ్య మమ్మల్ని పెంచింది. నాకు ఊహ వచ్చిన నాటికే నందమూరు గ్రామంలో ఉన్నాం. అక్కడ స్కూల్‌లో చదువుకున్నాను. అమ్మా, నాన్న ఎప్పుడూ సభ సమావేశాల్లో ఉండేవారు. అప్పుడప్పుడు మాత్రమే ఇంట్లో ఉండేవారు. అమ్మ వచ్చిందంటే సందడే సందడి. ఊరినుండి వచ్చేటప్పుడు ఆమె తెచ్చే ఒక్క పండైనా ఎంతో అపురూపంగా అనిపించేది. ఇంట్లో ఉన్నంత సేపు మా పనులన్నీ తానే చేస్తూ, అలా అమ్మ మాతో సమయం గడిపేది. వున్న కొంత సమయం అయినా ఎంతో ప్రేమను పంచేది. ఆ అనుభూతిని పొందేలోపే తిరిగి వెళ్ళిపోయేది. మరల ఎప్పుడు వస్తుందా..!? అని ఎదురు చేసేవాళ్ళం.

నాయనమ్మ బుల్లెమ్మగారు అప్పటికీ (నాకు ఊహతెలిసే నాటికి) ఆనారోగ్యంతో మంచంలో ఉన్నారు. ఆమె చనిపోయినపుడు ఊరంతా భోజనాలు పెట్టడం, ఆమె ఫొటో పెట్టి ఊరంతా ఎడ్లబండిమీద ఊరేగించడం ఇప్పటికీ కళ్ళుముందు మెదులుతుంది. అమ్మో ఎంత మంది జనం, వచ్చారో..! అని చాలా ఆశ్చర్యపోయాను. అమ్మా, నాన్నా.. ఎంతో గొప్పపనులు చేస్తున్నారు. అందుకే అంతమంది వచ్చారని మా మేనత్త చేప్తే ఆ వయసు నుంచే అర్థం చేసుకోవటం మొదలు పెట్టాం.

**మా అమ్మా, నాన్న, నాయనమ్మ బుల్లెమ్మగారి గురించి విడివిడిగా చెప్పటం సాధ్యం అయ్యే పనికాదు. ఎందుకంటే వాళ్ళు ముగ్గురి బంధం చాల బలమైనది, అందరూ కలిసి ఒకరిని ఒకరు గౌరవించుకుంటూ సమాజ సేవకు అంకితమయ్యారు.**

అమ్మగాని, నాన్నగాని మాపై కోపగించుకున్న సంఘటనలు అరుదు. తెలిసీ తెలియని వయసులో మేం చేసిన తప్పుల్ని క్షమించి దానివల్ల కలిగే నష్టం గురించి విడమరిచి మరీ చెప్పి, ఆలోచింప చేసేవారు. నిజమేకదా..! మరొసారి అలా చెయ్యకూడదని మాకే అనిపించేది. నేనూ, మా చెల్లి నందమూరు వచ్చాక మా మేనత్త (మా చిన్న నాయనమ్మ సీతారావమ్మ, బుల్లియ్యతాత)ల్ని మా దగ్గర ఉంచారు. వాళ్ళిద్దరు మాకు అమ్మా, నాన్న దగ్గరలేని లోటు కనపడకుండా ఎంతో ప్రేమగా చూసుకున్నారు.

**అమ్మ.. నందమూరు సర్పంచిగా వున్నపుడు.. 'మీ అమ్మ ఈ చెరువు తవ్వించింది, చెరువు చుట్టూ మొక్కలు వేయించింది' అని అందరూ అంటుంటే చాలా గర్వంగా అనిపించేది.**

నందమూరులో ఉన్న స్కూల్లో 5వ తరగతి వరకే ఉండేది. తర్వాత 6వ తరగతి చదవటానికి పక్కవూరు ఇందుపల్లె

వెళ్ళాల్సి వచ్చేది. నాకు ఆరోగ్యం సరిగా ఉండేదికాదు. జ్వరం వస్తూ ఉండేది. అందుకని 7వ తరగతిలో కొచ్చేసరికి విజయవాడలో వున్న విద్యోదయ స్కూల్‌లో చేర్పించి మా చిన్న అమ్మమ్మ రాజరత్నమ్మ, తాత కడియాల గోపాలరావు గారింట్లో ఉంచారు. అలా మరోసారి అమ్మకి దూరంగా రెండు సంవత్సరాలు ఉండాల్సి వచ్చింది.

నేను 8వ తరగతికి వచ్చేసరికి అమ్మా, నాన్న విజయవాడకు వచ్చేశారు. అప్పటి నుండి అమ్మతోనే ఉన్నాం. వారు చేసే పనులు చూడటం, అర్థం చేసుకోవటం మొదలయింది. అప్పటి వరకు వాళ్ళు ఎలా జీవిస్తున్నారో, మాజీవనానికి ఆర్థికంగా ఏం చేస్తున్నారో తెలియదు. ప్రతి సంవత్సరం పుట్టినరోజుకు మాత్రమే ఒక కొత్త డ్రెస్ కొనేవారు. వాటిని జాగ్రత్తగా వాడుకునేదాన్ని తరువాత అర్థం చేసుకుని, అమ్మని అడిగితే ఆర్థిక పరిస్థితి గురించి చెప్పింది. పార్టీ ఇచ్చే ఎలవెన్సుతో మనం బతకాలి మనకు కావలసింది తిండి, బట్ట, ఇల్లు. మనకు సరిపడా వుందికదా. అంతకుమించి కావాలని అనుకోకూడదు అని చెప్పింది. మహిళా క్లాసులు జరిగితే చిన్నప్పటి నుండి వెంట తీసుకెళ్ళేది. అక్కడికి వచ్చిన వారందరికి మంచినీళ్ళు అందించటంతో మాకు సేవ చెయ్యటం మొదలైంది. అక్కడ కొచ్చిన పిల్లలందరిని కూర్చొపెట్టి బాలల సంఘం అనేపేరుతో చిన్నారుల పాటలు, డాన్సులతోపాటుగా ఎన్నో

**అమ్మ కమ్యూనిస్టు పార్టీలో సభ్యురాలిగా, ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం అధ్యక్షురాలిగా పనిచేసింది. కమ్యూనిస్టు పార్టీ రాష్ట్ర కమిటి సభ్యురాలుగా చేసింది. అమ్మ జిల్లా, రాష్ట్ర అధ్యక్షురాలైనా, కార్యదర్శి అయినా తన పదవిని చాలా నిబద్ధతతో ఉపయోగించేది. కార్యకర్తలతోపాటు కార్యకర్తగానే కలిసి మెలిసి పనిచేసేదే గాని తన అధికారాన్ని ఎక్కడా ఉపయోగించేది కాదు. తాను వెనుకుండి నడిపిస్తూ కార్యకర్తలను ముందునిలబెట్టి ఎంతోమంది మహిళా నాయకురాళ్ళను తయారుచేసింది.**

విషయాల్ని తెలిపేవారు.

బయట అన్ని పనులు చేస్తూ కూడా, ఏమాత్రం అలసిపోకుండా చెలాకీగా ఇంటి బాధ్యతల్ని తానే చక్కదిద్దేది. ఉంగుటూరు మండల అధ్యక్షురాలిగ ఉంటూ స్త్రీలకు మరుగుదొడ్లు నిర్మించింది. రాష్ట్రంలో అన్ని మండలాల కంటే ఎక్కువగా కృషిచేసి సాధించింది. అందు కోసం పలుమార్లు హైదరాబాదు వచ్చినా, అక్కడే ఉన్న నా ఇంటికి రావడానికి సమయం ఉండేదికాదు. వచ్చినా కొన్ని గంటలు మాత్రమే.. చాలా బాధగా అనిపించేది. కాని సర్దుకుపోయేదాన్ని.

అమ్మా నాన్నగారు చాలా నిరాడంబరంగా జీవితం గడిపేవారు. దుస్తులు పరిమితంగ ఉండేవి. ఎక్కువగ ఊళ్ళ తిరుగుతున్న, అవసరానికి ఇదిచాలు అన్నంతవరకే ఉండేవి, అది అర్థం అయిన తర్వాతే, నేను 3 స్కూల్ డ్రెస్‌లతో ఎలా గడపాలో నేర్చుకున్నాను. మామూలు డ్రెస్‌లు వున్న, శనివారం కూడా స్కూల్ డ్రెస్ వేసుకునే దాన్ని. అలా పొదుపుగా దుస్తులు ఎలా వాడుకోవాలో తెలిసింది, మళ్ళీమళ్ళీ అమ్మా, నాన్న నా కోసం ఖర్చుపెట్టే అవసరం రాకూడదని అనిపించేది.

అమ్మకి చదువన్నా, చదువుకునే పిల్లలన్నా ఎంతో ఇష్టం. ఎలాగైనా నేను ఎస్ఎస్ఎల్‌సి (స్కూలు ఫైనల్) వరకైనా చదవాలని ఆరాటపడేది. నా అనారోగ్యం వలన 9వ క్లాసు వరకు చదువులో వెనుబడి ఉండేదాన్ని. 10వ తరగతిలో శస్త్రచికిత్స అనంతరం కోలుకున్న తర్వాత ఎస్ఎస్ఎల్‌సి 2వ గ్రేడ్‌లో ఉత్తీర్ణత సాధించినపుడు అమ్మ ఆనందం చెప్పనలవికానిది. ముఖ్యంగ అమ్మని సంతోషపెట్ట గలిగానని చాలా ఆనందపడ్డాను.

తర్వాత పాలిటెక్నిక్‌లో చేర్పించాలని అమ్మ నాన్న అనుకున్నారు. మొదటి లిస్టులో నాపేరు లేదు. గుంటూరు పాలిటెక్నిక్ కాలేజి ప్రిన్సిపాల్ గారు అమ్మకు తెలుసు. ఆమెని కలిసి మాట్లాడాలని అమ్మ ఆరాటం. కాని నాన్నగారికి రికమెండేషన్ ఇష్టంలేదు. ఎవరైనా స్వశక్తిమీద ఆధారపడాలి అనేది ఆయన సిద్ధాంతం. నాన్నగారు ఏది చెప్పినా అది అమ్మకి ఆచరణీయం. ఒకరినొకరు అర్థం చేసుకుంటూ, ఒకరిమాట ఒకరు గౌరవిస్తూ ఆదర్శంగా జీవించారు. నాన్నగారు మరల (అమ్మ నొచ్చుకోకుండా) 'సూర్యం! ఒకసారి పాలిటెక్నిక్ కాలేజికి వెళ్ళి అవకాశం ఉందో లేదో తెలుసుకో.. కాని అవకాశం ఇవ్వాలని మాత్రం అడగకు' అని చెప్పారు. అమ్మ.. నన్ను తీసుకుని గుంటూరు పాలిటెక్నిక్ కాలేజికి వెళ్ళింది. నాకు చాలా బాధగా

అనిపించింది. నాన్నగారి మాట పోగూడదు, అమ్మబాధ తీరాలి ఎలాగని. కాని నాన్నగారి నిబద్ధత, అమ్మ కోరికను తీరుస్తూ కాలేజి బోర్డులో 1:5లో నా పేరు చూసి చాలా ఆనందపడ్డాను. స్పోర్ట్సు కోటాలో సీటు వచ్చింది. స్పోర్ట్సులో స్కూల్‌లో సర్టిఫికేట్‌లు వచ్చాయి. చిన్నప్పుడు చాలా పిరికిదాన్ని. అన్నిటికి భయపడేదాన్ని. అనారోగ్యం కూడా ఒక కారణం కావొచ్చు. శస్త్రచికిత్స తర్వాత ఆరోగ్యం బాగుపడ్డాక ధైర్యం వచ్చింది. నాన్నగారు చెప్పిన పాఠాలన్ని ఉపయోగపడ్డాయి. అప్పటి నుండి ఇప్పటి వరకు నాన్న చెప్పిన పాఠాల్ని అమ్మ ఆశయాలు గుర్తు చేసుకుంటూ నాకు సాధ్యమైనంత వరకు ఆచరించే ప్రయత్నం చేస్తున్నాను.

అమ్మా, నాన్న పూర్తిగా ప్రజాసేవకు అంకితమయ్యారు. వారికి నేను భారం కాకూడదు. వారికి చేదోడు వాదోడుగా ఉండాలని ఆలోచించేదాన్ని. అందుకే పాలిటెక్నిక్ కోర్సుపూర్తిచేసి, ఉద్యోగం సంపాదించి ఆర్థిక తోడ్పాటు అందించాలని ఇష్టంతో చదవాను. మొదటి గ్రేడ్‌లో ఉత్తీర్ణత సాధించి, కాలేజీ 2వ స్థానం వచ్చిన రోజు, అమ్మ ఆశయం నేరవేర్చానని, అమ్మ సంబరాన్ని చూసి, చాలా ఆనందపడ్డాను. డిప్లమో సర్టిఫికేట్ తెచ్చి అమ్మకిస్తే, నాన్నగారికి చూపించింది. తర్వాత చూస్తే టేబుల్ మీద సర్టిఫికేట్ లేదు. అమ్మని అడిగితే చూడలేదని అంది. సాయంత్రం ఫ్రేమ్ కట్టించి గోడకు తగిలించివుంది. నాన్నగారు ఆ పనిచేసి, ఆనందాన్ని తెలియజేశారు. ఆయన నిండుకుండ. ఎక్కువగా స్పందనలు కనిపించనివ్వరు. అమ్మ రాజకీయ జీవితం. గురించి ఆయన సమకాలికులు, కలిసి పనిచేసినవారు చెప్పారు అందువలన నేను కుటుంబం వరకు పరిమితమయ్యాను. అమ్మ ప్రస్తావన గురించి కంటే నా ప్రస్తావన ఎక్కువగ వుండవచ్చు. నేను అమ్మతో గడిపిన సమయం చాలా తక్కువ. 5 సంవత్సరాలు మాత్రమే అమ్మతో కలిసి ఉన్నాను.

**ఒకసారి అమ్మవాళ్ళని చూడటానికి, అమ్మనాన్నతో పాటు అరెస్టు అయిన డిటెన్యూలందరి (కస్టడీ) కుటుంబీకులతో ఒక బస్సునిండా హైదరాబాదు తీసుకెళ్ళారు. ముఖ్యమంత్రికి వినతి పత్రం ఇవ్వడానికి. ఆ సందర్భంగా నేను ముందు వరుసలో నిలబడ్డాను. నాన్నతోపాటు అమ్మని కూడా అరెస్టు చేశారు. మాకు తల్లి రక్షణ అవసరమని అమ్మని విడుదల చేయాలని అడిగారు. ఒక రోజంతా అమ్మతో గడపటానికి అనుమతి తీసుకున్నారు. అమ్మని పగలంతా నాన్నగారు, మిగతా మామయ్యలంతా ఉన్న మగవారి జైలులో వారితో పాటు ఉంచి, రాత్రి ఆడవాళ్ళ జైలుకి పంపేవారు. ఇరత ఖైదీలలాగా కాకుండా మంచి వసతి, మంచాలు,ఆడుకోవటానికి స్థలం, చదువుకోవటానికి పేపర్లు,పుస్తకాలు వున్నాయి. నాన్నగారు బాల్ బాట్మింటన్ బాగా ఆడేవారు. ఆడవాళ్ళ జైలులో కూడ అమ్మకి సౌకర్యంగల, గది వుంది. అక్కడ జైలు వాతావరణం చూశాక ధైర్యం వచ్చింది.**

1964లో ఒకరోజు అర్థరాత్రి నిద్రలేపింది. చూస్తే అప్పటికే సంచులు సర్ది వున్నాయి. బయటకు చూస్తే పోలీసులు, భయం వేసింది. అమ్మ దగ్గరకు తీసుకుని భయపడవద్దు. వాళ్ళు నన్ను, నాన్నని తీసుకువెళ్ళటానికి వచ్చారు అని చెప్పింది. పోలీసులు మిమ్మల్ని కొడతారా? జైల్లో అన్నం పెడతారా? అని అడిగిన గుర్తు. మేము ఖైదీలం కాదు. తప్పు చేయలేదు. దొంగతనం, హత్య చెయ్యలేదు. అందుకని మమ్మల్ని చాలా బాగా మనింట్లోలాగా చూస్తారు. ధైర్యంగా ఉండి, బాగా చదువుకోండి అని చెప్పింది.

లక్ష్మి అత్తయ్య మా మేనమామ భార్య పక్క పోర్షన్‌లో ఉండేవారు. ఆవిడ మా ఇద్దర్ని (నన్ను, చెల్లిని)చాలా బాగా చూసేవారు. విజయవాడలో వున్నప్పుడు పక్కనే డివిఎస్‌గారు (డివి. సుబ్బారావుగారు విశాలాంధ్ర పత్రిక ప్రెస్ మేనేజర్.) భిక్షావతిగారు, సూర్యవతి గారు సొంత అక్కచెల్లెళ్ళ లాగా కలిసి మెలిసి ఆంధ్రమహిళా సంఘంలో, కమ్యూనిస్టు పార్టీలో జీవితాంతం వరకు పనిచేశారు. అప్పటి నుండి వారి 4గురు పిల్లలు నేను మా చెల్లి కలసి మెలిసి పెరిగాం. అమ్మ సూర్యావతి, డివిఎస్ గారి భార్య బిక్షావతి కలిసి పార్టీ సభల్లో బిజిగా ఉండేవారు. బిక్షావతిగారి తల్లిగారు మా పిల్లలందరి అవసరాలు చూస్తూ ఉండేవారు.

అమ్మ ఆశయాలు, ఆలోచనలు,

ఆచరణలు తలుచుకుంటూ ఎంతోకొంత నేనుకూడ మహిళలకు, పిల్లలకు సేవచెయ్యొచ్చు, అమ్మనాన్నకు ఆర్థిక భారం లేకుండా చెయ్యాలనే తపనతో, మహిళా శిశు సంక్షేమ శాఖలో ఉద్యోగంలో చేరాను. ప్రభుత్వ సంక్షేమ పథకాలు అమలు చెయ్యటంలో, లబ్ధిదారులకు అందించటంలో నా వంతు కృషిచేశాను. ఉద్యోగాన్ని బాధ్యతగానే కాక, మనసుపెట్టి చేశాను. అమ్మలోని నాయకత్వ లక్షణాలు నాకూ వచ్చాయని తలుస్తాను. అమ్మనింపిన స్ఫూర్తితో.. ప్రభుత్వ ఉద్యోగుల సంఘంలో హైదరాబాదు సిటికి రాష్ట్ర సంఘానికి, అఖిల భారత స్థాయిలో వివిధ పదవులలో బాధ్యతల్ని నిర్వహించాను. ప్రభుత్వ ఉద్యోగులకు రూల్సు, రెగ్యులేషన్స్ వుంటాయి కాబట్టి, అదే రంగంలో సేవల్ని అందించాను. ఉద్యోగంలో చేరిన కొత్తలో ఒకసారి సిపియం పార్టీ ఊరేగింపు జరుగుతుంటే చిన్నప్పటి నుండి పెరిగిన వాతావరణాన్ని బట్టి, అమ్మానాన్నలందించిన స్ఫూర్తితో, ఊరేగింపులో పాల్గొని స్లోగన్లు ఇచ్చాను. అప్పుడు మధు అన్నయ్య (స్టేట్ సెక్రెటరి) పక్కకు పిలిచి, నీవలా పాల్గొనకూడదు. ప్రభుత్వ రూల్సుకి విరుద్ధం అన్నారు. అప్పుడు చాలా బాధపడి, ఏడ్చాను. నన్నెందుకు ఉద్యోగంలో చేరమన్నారని అమ్మ, నాన్నని అడిగాను. నీలాంటి వాళ్ళు కూడా పార్టీకి కావాలి. ఎక్కడున్న, ఉన్నచోటే మన సిద్ధాంతాలు ప్రచారం చేస్తూ, ప్రచారం చెయ్యొచ్చని చెప్పారు.

> **ఐద్వా హైదరాబాద్ నగరశాఖలో, సీఐటియు శాఖలో మెంబరుగా పని చేశాను. ప్రభుత్వ ఉద్యోగినులు సిఐటియు వర్కింగ్ ఉమెన్‌లోనూ, ఐద్వాలోనూ కలిసి పనిచేసేలా నా వంతుగా కృషి చేశాను. కాండక్టు రూల్సు అడ్డు వస్తాయి కనుక ఏది చేసినా తెర వెనుక చెయ్యాల్సిందే కనుక ప్రత్యక్షంగా ఎవరికీ నేను చేసిన పనులు తెలిసే అవకాశం ఉండేది కాదు.**

వారి మాటలు బుర్రలో నాటుకున్నాయి. మహిళా ఉద్యోగుల సమస్యల పట్ల అవగాహన చేసుకున్నాను. ఎ.పి.ఎన్.జి.ఒ అసోసియేషన్‌లో మహిళా విభాగాన్ని 1990లో ఏర్పాటు చేయించారు. ఏర్పాటైన రెండు సంవత్సరాల్లో మహిళాకమిటి పని చెయ్యటం మానేసింది. అప్పుడు నేను హెడ్ ఆఫ్‌ది డిపార్టుమెంట్ వద్ద పేషీలో పనిచెయ్యటం వలన సమయం లేక కమిటిలో లేను. అయినా సర్వీసులో చేరినప్పటి నుండి ప్రభుత్వ ఉద్యోగుల పోరాటాలలో భాగస్వామినయ్యాను. ఎపిఎన్‌జిఒ ప్రభుత్వ ఉద్యోగినుల శాఖ 2001లో ఏర్పాటు చేసి, నన్ను రాష్ట్ర చైర్‌పర్సన్ (అధ్యక్షురాలు)గ నియమించారు. ఆ తర్వాత అఖిల భారత రాష్ట్ర ప్రభుత్వ ఉగ్యోగుల సంఘంలో ఇ.సి మెంబరుగా పనిచేశాను.

ఓసారి సిపియం అఖిల భారత మహాసభలు 1984సం॥ కలకత్తాలో జరుగుతున్నపుడు నేను, నా భర్త చంద్రశేఖరరావు, మామగారు చెన్నుపాటి వెంకటేశ్వరరావుగారు మరికొందరితో కలిసి వెళ్ళాం. అప్పుడు అమ్మ డెలిగెట్ (ప్రతినిధి)గా ఉంది. ఒక రోజు భోజన విరామ సమయంలో మహిళా ప్రతినిధుల దగ్గరకు తీసుకువెళ్ళి పరిచయం చేసింది. అంతమంది మహిళా ప్రతినిధుల్ని, అన్ని రాష్ట్రాల నుండి వచ్చిన వారందర్ని చూసి నేనూ.. వాళ్ళలాగ పనిచెయ్యాలని నిర్ణయించుకున్నాను. నాకు లభించిన ప్రతి అవకాశాన్ని వినియోగించి నా శక్తి మేరకు కృషి చేసేందుకు మా అమ్మ మానికొండ సూర్యావతి, నాన్న మానికొండ సుబ్బారావులే స్ఫూర్తి ప్రదాతలు.

నాన్నగారు చనిపోయినపుడు, పార్టీలకు అతీతంగా అందరు అంజలి ఘటించటానికి వచ్చారు. అందులో పోలీసు శాఖ వారుకూడ ఉన్నారు. ఆయన అంత అజాత శత్రువు. అలాగే అమ్మపోయినపుడు, మహిళా సంఘ నాయకురాళ్ళంతా కన్నీరు మున్నీరయ్యారు. అంతేకాకుండా, అమ్మ భౌతిక కాయాన్ని మోయటానికి "నేను సైతం" అంటూ ముందుకు వస్తుంటే ఆమె ఎంతటి ధన్యజీవి అని దుఃఖంతో కూడిన ఆనందం కలిగింది. ప్రజాసేవే లక్ష్యంగా బతికిన మా అమ్మకు ఆమె ఆశయాన్ని ముందుకు తీసుకువెళ్లడమే నేను ఇవ్వగలగిన అసలైన నివాళ్ళు. అశ్రునివాళులు అని అనలేను, ఎందుకంటే నాన్నగారు, "అనవసరంగా అశ్రవులు రాల్చకూడదు" అనేవారు. ◆

# మహిళా హక్కుల నేత సూర్యావతి గారి
# శతజయంతి శుభాకాంక్షలతో....







**శ్రీ డా॥ పి. శ్రీనివాసరావు గారు**
వైద్యులు, ప్రజావైద్యశాల
నాయుడువీధి - సాలూరు

**శ్రీ డా॥ బి. గంగరాజ శేఖరం గారు**
ప్రశాంతి క్లీనిక్, కోటవీధి - సాలూరు


# మహిళా హక్కుల నేత సూర్యావతి గారి
# శతజయంతి శుభాకాంక్షలతో....








**శ్రీమతి సి.హెచ్. సుగుణ గారు**
సూపర్‌వైజర్, పాచిపెంట
ఐ.సి.డి.ఎస్. పాచిపెంట ప్రాజెక్టు

**శ్రీమతి గంధ్రేటి అనురాధగారు**
సూపర్‌వైజర్, మామిడిపల్లి సెక్టార్
ఐ.సి.డి.ఎస్. సాలూరు రూరల్ ప్రాజెక్టు



చెడు లక్షణాలున్న భర్తతో తెగదెంపులు చేసుకున్న భార్య వ్యధాభరిత గాథ ఇది. ఒక సమస్య నుంచి బయటపడేలోపు మేక తోలు కప్పుకున్న 'తోడేలు' మానవ రూపంలో ఆమెను అనుసరించి.. మాయ మాటలతో నమ్మించి.. పెళ్లి చేసుకుందామని ఒప్పించి.. తన ఆర్థిక, శారీరక అవసరాలు తీర్చుకుని తల్లిని చేసి.. చాటుమాటుగా సాక్ష్యాలన్నీ మాయం చేసిన ఓ మృగాడి మోసానికి సాక్ష్యమే ఈ అంతులేని కథ!

# అంతులేని కథ

ఆమెకు అంతకు ముందే వివాహమైంది. భర్త బాధ్యత లేకుండా నెలల తరబడి ఎక్కడికో వెళ్లడం, తాగుడు వంటి అవలక్షణాలు ఉండటం వల్ల ఇద్దరికీ సఖ్యత కుదరలేదు. పంచాయతీ పెద్దల సమక్షంలో విడిపోయారు. కానీ అప్పటికే ఆమె తల్లికాబోతోంది. ఇంట్లో వాళ్లు అబార్షన్ చేయించుకోమన్నారు. పసిబిడ్డ ఏం తప్పు చేశాడని చంపుకోవాలి? అని ఎదురు ప్రశ్నించింది ఆమె. నా కష్టంతో నా బిడ్డను పెంచుతాను అని ధైర్యంగా ముందడుగు వేసింది. బిడ్డకు జన్మనిచ్చింది.

**పంచాయతీ సెటిల్మెంట్‌లో వచ్చిన డబ్బులు బ్యాంకులో వేద్దామని వెళ్లిన ఆ మహిళకు అక్కడ ప్రసాద్ అనే వ్యక్తితో పరిచయం ఏర్పడింది.** ప్రసాద్ అక్కడ కాంట్రాక్టు ఉద్యోగి. ఆమె వివరాలు అన్నీ అడిగి తెలుసుకున్నాడు. అమాయకంగా ఆమె తన పేరు గౌరీ అని, తన గతమంతా వివరంగా చెప్పింది. తరువాత నుంచి ఆమెకు తరచుగా ఫోన్ చేసి ఆమె క్షేమ సమాచారాలు కనుక్కునేవాడు. మంచి మనసున్నవాడని ప్రసాద్‌పై గౌరీ మంచి అభిప్రాయం పెంచుకుంది. బ్యాంకులో తరచుగా కలుసుకుంటుండేవారు. **ఒకనాడు ప్రసాద్ పెళ్లి ప్రస్తావన తెచ్చాడు. ఆమె ససేమిరా అంగీకరించలేదు. నీకు అసలు పెళ్లే కాలేదు. నాకు ఒక కొడుకు ఉన్నాడు. ఇది జరగదు అని తేల్చి చెప్పింది. నీ గతం నాకు అనవసరం. నాకు లేని అభ్యంతరం నీకు ఎందుకు అని ఆమెకు నచ్చజెప్పాడు.** నెమ్మదిగా ఆమె ఇంట్లోవాళ్లకు చెప్పింది. వారు అప్పుడే తొందరపడకు. ఆలోచించి నిర్ణయించుకో అని సలహా ఇచ్చారు.

ప్రసాద్ మాత్రం తనకొక చెల్లి ఉందనీ, ఆమె పెళ్లి అయ్యాక మనం పెళ్లి చేసుకుందామన్నాడు. తరచుగా ఫోన్ చేయడం మాత్రం మానలేదు. మా చెల్లి పెళ్లి చేయాలంటే డబ్బు కావాలి. అంత డబ్బు ప్రస్తుతం నా దగ్గరలేదు. డబ్బు కూడబెట్టి ఆమె పెళ్లి చేసి తరువాత మనం పెళ్లి చేసుకోవడమంటే ఎప్పటికో కదా అనేవాడు. అవసమైతే నా దగ్గర డబ్బు సర్దుతాను... ముందు ఆమె పెళ్లి చేయండి అని చెప్పిందామె.

ఆమె డబ్బు సహాయంతో ప్రసాద్ చెల్లి పెళ్లి జరిగింది. కొన్నాళ్లకు మనిద్దరం పెళ్లయ్యాక విడిగా ఉందాం. మనకు ఉన్నంతలో తక్కువ ఖర్చుతో ఒక చిన్న ఇంటిని ప్లాన్ చేద్దామన్నాడు. మంచి ఆలోచనే కదా అని ఆమె అంగీకరించి ఇంటి కోసం ఖర్చు పెట్టింది. ఒక చిన్న ఇల్లు కొనుక్కోగలిగారు. ఇక సెటిల్ అయ్యాం కదా పెళ్లి చేసుకుందామా అని అందామె. **అప్పుడు వచ్చిన సమాధానంతో ఆమెను చుట్టూ చీకటి ఆవహించినట్లయింది.**

**'పెళ్లెందుకు సహజీవనం చేద్దాం.. ఇంత వయస్సు వచ్చాక పెళ్లి అవసరమా' అని అన్నాడు. దీనికి మాత్రం ఆమెగానీ, ఆమె కుటుంబం గానీ అస్సలు ఒప్పుకోలేదు. చేసేదిలేక ఆమె కుటుంబ సభ్యుల సమక్షంలో**

→

**ఇంట్లోనే ఆమెకు తాళి కట్టాడు. కొన్నాళ్లు ఇద్దరూ ఆనందంగా ఉన్నారు. పోనీలే తన జీవితం గాడిన పడిందని సంతోషించిందామె.** తల్లిదండ్రులు కూడా ప్రసాద్ మంచితనం చూసి ఆనందించారు. కొన్నాళ్లకు ఆమె గర్భవతి అయింది. ఎంతో సంతోషంగా చెప్పింది ప్రసాద్‌కు. అప్పుడు ప్రసాద్ చెప్పిన మాటలకు ఆమెకు నోట మాట రాలేదు. మనకొక బిడ్డ ఉన్నాడు కదా.. నీ కొడుకు నా కొడుకు కాదా. మళ్లీ ఇంకొకళ్లు ఎందుకు? ఈ రోజుల్లో ఇద్దరిని చదివించడం ఎంత కష్టం. **ఈ బిడ్డ మనకు వద్దు. అబార్షన్ చేయించుకో అని చెప్పాడు. అందుకు ఆమె అంగీకరించలేదు. ఇంతకన్నా గడ్డు పరిస్థితుల్లోనే నేను ఆ పాపం చేయలేదు. ఇప్పుడు అస్సలు చేయను అని గట్టిగా చెప్పింది. ఇద్దరి మధ్య గొడవలు మొదలయ్యాయి.**

కొన్నాళ్లకు ప్రసాద్ కనిపించకుండా వెళ్లిపోయాడు. మరోమార్గం లేక తన భర్త కనబడటం లేదని పోలీసు కేసు పెట్టిందామె. మెల్లగా కొన్నాళ్లకు వచ్చాడు. ఆమెతో ప్రేమగా ఉన్నాడు. ఒకనాడు ఆమెను గుడికి తీసుకెళు తానన్నాడు. కానీ వెళ్లింది గుడికి కాదు. ఒక నిర్మానుష్య ప్రదేశానికి. నేను చెప్పిన మాట విని అబార్షన్ చేయించుకోకపోతే నీకు నాకూ ఏ సంబంధం ఉండదు. తరువాత పరిణామాలు చాలా దారుణంగా ఉంటాయని బెదిరించాడు. భయపడి ఆమె అతను చెప్పినట్లే చేసింది.

ఆమె ఇంకా కోలుకోకుండానే మొక్కుకున్నాను అని చెప్పి ఆమెను తిరుపతి తీసుకెళ్లాడు. నాలుగైదు రోజులు ఇద్దరూ అక్కడే ఉన్నారు. ఇంటికొచ్చాక కూడా బాగానే ఉన్నారు. ఇన్నాళ్లయినా ఆమె పుట్టింట్లోనే ఉన్నాడు గానీ వారు తీసుకున్న ఇంట్లో వేరు కాపురం పెట్టలేదు. **ఆ అమాయకురాలు గమనించకుండా ఆమె దగ్గర తన ఆధారాలు ఏమీ లేకుండా జాగ్రత్తపడ్డాడు. ఫోన్‌లో డేటా కూడా తీసేశాడు. అప్పుడు వెళ్లిపోయినవాడు తిరిగిరాలేదు. మళ్లీ పోలీసు కేసు పెట్టింది.**

**ముందే వాళ్లకు డబ్బులిచ్చాడేమో మరి వాళ్లు కలగజేసుకోలేదు. న్యాయం జరగలేదు. గౌరీ స్థానికంగా ఉన్న ఒక రాజకీయ పార్టీ మహిళలను ఆశ్రయించింది. వారు లక్ష రూపాయలు డిమాండ్ చేశారు. విధిలేక అంగీకరించింది. వారిని తీసుకుని ప్రసాద్‌ను కలిశాక...ప్రసాద్ తరుపు నుంచి కూడా వాళ్లు డబ్బు డిమాండ్ చేశారు. ప్రసాద్‌కు అనుకూలంగా మాట్లాడారు. ఇంకేం చేయాలో తెలీక ఆమె ఐద్వా అదాలత్‌కు వచ్చింది.**

ముందే వాళ్లకు డబ్బులిచ్చాడేమో మరి వాళ్లు కలగజేసుకోలేదు. న్యాయం జరగలేదు. గౌరీ స్థానికంగా ఉన్న ఒక రాజకీయ పార్టీ మహిళలను ఆశ్రయించింది. వారు లక్ష రూపాయలు డిమాండ్ చేశారు. విధిలేక అంగీకరించింది. వారిని తీసుకుని ప్రసాద్‌ను కలిశాక...ప్రసాద్ తరుపు నుంచి కూడా వాళ్లు డబ్బు డిమాండ్ చేశారు. ప్రసాద్‌కు అనుకూలంగా మాట్లాడారు. ఇంకేం చేయాలో తెలీక ఆమె ఐద్వా అదాలత్‌కు వచ్చింది. ఈ పరిస్థితిలో ఉన్న ఆమె జీవితాన్ని చక్కదిద్దడం ఐద్వాకు ఒక సవాల్‌గా మారింది. వారు ఆమెకు ఈ విధంగా చెప్పారు.

రెండో వివాహం చేసుకోవడం తప్పు కాదు. కానీ అన్నీ ఆలోచించి అడుగు ముందుకు వేయాలి. **అతని వ్యవహారం చూస్తే మోసం చేస్తున్నాడేమో అని నీకు అర్థం కాకపోవడం నీ అమాయకత్వం. పెళ్లి ఫొటోలు కానీ, ఏవైనా సాక్ష్యాలు కానీ లేకుండా ముందుకు ఎలా వెళతాం. మీరు చదువుకున్నారు. పెళ్లి రిజిస్టర్ చేయించుకోవాలని తెలియలేదా? ప్రసాద్ నిన్నూ, నీ డబ్బునూ ఉపయోగించుకున్నాడు. ఏదో కొంత కాలం తాత్కాలికంగా నిన్ను ప్రేమగా చూసుకున్నాడు. ఏ చిన్న ఆధారమైనా మీరు సంపాదిస్తే ఈ కేసు ముందుకెళు తుంది. ప్రస్తుతం మిమ్మల్ని ఐద్వా ద్వారా మహిళా కమిషన్ వద్దకు పంపిస్తాం. వారు పోలీసులను కూడా ప్రశ్నించే హక్కు కలిగి ఉంటారని చెప్పారు.** ఆమెకు ఒక ఐద్వా మహిళను తోడిచ్చి పరిచయం చేసి ఆమె సహాయంతో మహిళా కమిషన్‌కు వెళ్లమన్నారు.

ఆమె ఆ రోజు వెళ్లకుండా తరువాత రోజు ఐద్వా మహిళను కలుస్తానని చెప్పి ఆ రోజున ఆవేశంతో తన బంధువుల సహాయంతో ప్రసాద్ ఇంటిపై దాడి చేసింది. ఇంకేముంది వెంటనే ప్రసాద్ తల్లి పోలీస్ కంప్లైంట్ ఇచ్చింది. ఆమె ఐద్వా అదాలత్‌కు వచ్చి ఐద్వా పెద్దలను 'నేనేం తప్పు చేశానని రమ్మన్నారు' అని అడిగింది. ఇరువైపుల పెద్దలతో మాట్లాడాలని మిమ్మల్ని రమ్మన్నాం అని చెప్పారు. నా కొడుకు తప్పు చేస్తే నేనేం చేయను. వాళ్లిద్దరి మధ్య ఎలా పరిచయమో ఈ కథంతా నాకేం తెలీదు. వాళ్లిద్దరూ ఇంట్లో ఏం చెప్పలేదు. నాకేం బాధ్యత లేదు అని ఆమె చెప్పింది. ఐద్వా పెద్దలు ప్రసాద్ తల్లికి నచ్చజెప్పి పంపించి గౌరీతో మాట్లాడారు. మొదటి భర్తతో విడిపోయే సమయంలో వచ్చిన డబ్బు మొత్తం ప్రసాద్ తినేసి ఆమెను వదిలించుకున్నాడు. ఆమె కుటుంబం తప్ప ఆమెకు జరిగిన అన్యాయానికి సాక్షులు ఎవరూ లేరు. ఆమెకు న్యాయం చేయాలంటే చాలా ప్రయత్నాలు జరిగి అవి ఫలించాలి.

ప్రస్తుతానికి ఆమెకు నచ్చజెప్పి మహిళా కమిషన్ వద్దకు ఐద్వా మహిళ సహాయంతో పంపారు. కేసు పరిశీలనలో ఉంది. ఆమెకు ఎప్పటికి న్యాయం జరుగుతుందో మరి ◆

## మహిళా హక్కుల నేత సూర్యావతి గారి శతజయంతి శుభాకాంక్షలతో....



**శ్రీమతి జి. పార్వతి గారు**

ఎం.పి.డి.ఓ. మరియు సిబ్బంది

మండల పరిషత్ కార్యాలయం - సాలూరు


## మహిళా హక్కుల నేత సూర్యావతి గారి శతజయంతి శుభాకాంక్షలతో....




**శ్రీ వి. మహేంద్ర కుమార్ గారు**

మేనేజర్, జి.సి.సి. సోప్స్ యూనిట్

విజయనగరం

బి.హరిత

## మరుగునపడ్డ సామాన్య మహిళల

# పెనుగులాట




**ఆడవాళ్ళు మగవాళ్ళు సమానం**
**చంకలో బిడ్డ, చేతిలో గంటెతో నేను**
**కాలంతో పోటీ పడుతూ నేను**
**నడుస్తున్న కూరగాయల మార్కెట్‌లా నేను**
**యోగాలు వాకింగ్‌లు చేస్తూ కాలాన్ని,**
**మబ్బులు పట్టిన ఆకాశాన్ని ఆస్వాదిస్తూ అతను**
**ఎవరన్నారు ఇద్దరూ సమానం కాదని....**

ఇలా ఈ పుస్తకం చదువుతున్నంతసేపూ ఆధునిక మహిళ ఛేదించుకుని వచ్చిన సంకెళ్ళు అడుగడుగునా గుర్తుకు వస్తాయి. ఈ రోజుకు చేరుకోవటానికి ఎన్ని అడ్డంకులు, ఎన్ని అవరోధాలు ఎదుర్కొన్నారు, ఎన్ని ఎగతాళి మాటలు పడుతున్నారు. మన ముందు నడచినవారు, అంతకుముందు నడచిన వారు. ఇంకా చాలా గుర్తుకువస్తాయి చదువుతున్నప్పుడు. **ఎంతమంది నృత్యకారులు, ఎంతమంది శాస్త్రజ్ఞులు, ఎంతమంది కవయిత్రులని ఈ సమాజం మాయం చేసిందో అంటూ బాధ పడిన చలం మాట మన చెవులలో వినబడుతుంది. మానవజాతి మొట్టమొదటి బానిస మహిళ అన్నారు ఎంగెల్స్. ఆడవాళ్ళని అదుపులో పెట్టటానికి ఎన్నెన్ని పద్ధతులో. అధికారం, పెత్తనంతో మొదలు పెడతారు.** అయినా వినకపోతే దండన, అదీ పనిచెయ్యకపోతే దేవత అని పొగడటం. ఎన్ని మార్గాలో.

స్త్రీ స్వేచ్ఛ అంటే తమపై తమకి అన్ని విధాలుగా హక్కులు వుండటం. ఆ హక్కు కోసం ఆధునిక మహిళ ఇప్పటికీ తపన పడుతూనే వుంది. కొత్త రకాల సంకెళ్ళు ఆడవాళ్ళకి వెయ్యటానికి ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయి. ఇప్పుడే ఇలా వుంటే 120 సంవత్సరాల క్రితం పరిస్థితి ఎలావుండేది. చలం, గురజాడ, శ్రీపాద లాంటి వారు అప్పటి స్త్రీల పరిస్థితులు వివరిస్తూ చాలా రాసారు. ఈ పుస్తకం కూడా 120 ఏళ్ళ క్రిందట ఏంతో కొంత స్వతంత్ర్య ఆలోచనలు, సమాజం పట్ల తపన వున్న స్త్రీ తన అస్తిత్వం కోసం చేసిన పెనుగులాటని చెబుతుంది. ఆమె చెయ్యగలిగిన పోరాటం – అది ఎంత చిన్నదైనా చెయ్యవలసిన అవసరాన్ని చెబుతుంది. విజేతలంటే అందరూ గుర్తించిన, కళ్ళు మిరిమిట్లు గొలిపే వెలుగులలో వుండే వాళ్ళే కాదు, చరితలోకి ఎక్కని అనేకమంది వున్నారని చెబుతుంది.

సమాజంలో వున్న ప్రతి పొరలోని మహిళ ఏదో రకమైన అణిచివేతకు గురిఅయిన, అవుతున్న వారే, బాల్య వివాహాలు, భర్త చనిపోయిన వారికి గుండు గీయించటాలు, సతి సహగమనాలు ఒక పొరలో వున్న మహిళలు ఎదుర్కొన్న దుర్మార్గాలు. పితృస్వామ్య దాష్టికాలతో పాటు కులోన్మాద దాడులకు ఇంకో పొరలో మహిళలు గురైయ్యారు. తమ సౌకర్యాలకు, ఆధిపత్యానికి ఏమాత్రం భంగం కాకుండా స్త్రీలను నిరంతరం కండిషనింగ్ చేస్తూ వచ్చింది సమాజం తలలు బోడులైనా, తలపులు బోడులవునా అన్నారు వేమన.

స్త్రీ ప్రయాణం కారాగారం నుంచి నరకానికి అంటారు ఫెమినిస్ట్ నవల "విముక్తి" రాసిన సాహిత్య అకాడెమీ బహుమతి గ్రహీత, గుజరాతీ రచయిత, ఫెమినిస్ట్ అయిన కుందనిక కపాడియ. ఇలా వున్న సమాజంలో స్త్రీవాదం, స్త్రీ స్వాతంత్ర్యం, స్త్రీల హక్కులు అంటే ఏమిటో కూడా తెలియని కాలంలో తన పరిధి మేర తన హక్కుల కోసం ఎదురుతిరిగిన సుబ్బలక్ష్మి కథే ఈ పుస్తకం.

మైథిలి శివరామన్ ఐద్వా వ్యవస్థాపక సభ్యురాలు. మహిళా ఉద్యమాన్ని తీర్చిదిద్దిన ఆసామాన్యురాలు. తన అమ్మ జీవితాన్ని తరచి చూసి దానిని చరిత్రలో భాగం చెయ్యటానికే ఈ పుస్తకం రాసారు. అప్పటి బ్రాహ్మణ కుటుంబాలలో లాగానే సుబ్బలక్ష్మికి కూడా 11 ఏళ్ళకే పెళ్లి అయింది. 14 ఏళ్ళకే తల్లి కూడా అయింది. ఆమె ఒక సామాన్య మహిళ. అయినా ఆమె జీవితం నుంచి నేర్చుకోవలిసింది చాలా వుంది. **బడి ముఖమే ఎరుగని సుబ్బలక్ష్మి గ్రంథాలయం నుంచి లేదా వీలైతే**

→

కొనుక్కుని వందల పుస్తకాలు చదివారు. తమిళం, ఇంగ్లీష్, ఖగోళ శాస్త్రం, మానసిక శాస్త్రం, యాత్ర సాహిత్యం ఇలా ఎన్నో పుస్తకాలు చదివారు.

పక్షులను, పువ్వులను చూస్తూ గంటలు గడిపేవారు అంటారు మైథిలి. ఆమె చెయ్యలిగిన మేరకు అప్పుడు జరుగుతున్న స్వాతంత్ర్యోద్యమం లో భాగస్వామి అయ్యారు. సాధారణమయిన అందరు అమ్మమ్మల్లా సుబ్బాలక్ష్మి మనవళ్ళను ముద్దు చెయ్యదని, గోరుముద్దలు తినిపించదని మైథిలికి చిన్నప్పుడు సుబ్బలక్ష్మి అంటే అంత ఇష్టం వుండేది కాదట. పెరిగి పెద్దయ్యాక మహిళా ఉద్యమంలోకి వచ్చాక అమ్మమ్మ మైథిలికి అర్థం అయ్యారు. **వ్యక్తిగా తనను తాను నిలబెట్టుకోవటానికి చేసిన జీవితకాలపు పోరాటంలో ఎదుర్కొన్న వత్తిడులతో మూర్ఛ వ్యాధికి గురయ్యారు సుబ్బలక్ష్మి. ఆమె చేసిన పోరాటం, ఆమె పడిన ఘర్షణ అర్థం అయిన తరువాత ఆమె లాంటి సామాన్యులు చేసిన పోరాటాన్ని చరిత్రలో భాగం చెయ్యవలసినన అవసరాన్ని మైథిలి గుర్తించి ఈ పుస్తకాన్ని మనకందించారు. పురుషాధిక్య సమాజం, మత ధర్మాలు భార్య అంటే ఇలా వుండాలి అని ప్రమాణాలు నిర్దేశించాయి. ఆ ప్రమాణాలలో ఒదిగి జీవితం గడిపితే ఎలాంటి ఒడిదుడుకులు వుండవు. జీవితం ప్రశాంతంగా వుంటుంది. వాటిని ఎదిరించి నిలబడిన వారికీ గయ్యాళీ అని పేరుపెడుతుంది సమాజం. అటు ఎదిరించలేని, ఒదిగి ఉండలేని వారికి దెయ్యం పట్టటం, సుబ్బలక్ష్మికి వచ్చినటువంటి మూర్ఛ వ్యాధులు రావటం జరుగుతుంది. ఇలాంటి వారు ఎంతో మంది వుండేవారు.**

**ఈ పుస్తకం చదివిన తరువాత వారి గురించి తప్పక ఆలోచిస్తాము. ఎలాంటి వత్తిడులు, తీరని కోర్కెలు, అణిచివేతలు వారిని ఆ పరిస్థితిలోకి నెట్టాయా అని మదనపడతాము.** ఆకాశమంత మానసిక చైతన్యం వుండి ఇరుకైన భౌతిక ప్రపంచలో ఇమడలేక అవస్థలు పడి తమ పరిధిలోనే ఘర్షణ పడిన అనేక మంది సామాన్య మహిళను ఈ పుస్తకం గుర్తు చేస్తుంది. తరచి చూస్తే మన చుట్టూ ఎంతో మంది సుబ్బలక్ష్ములు వుంటారు. వారి జీవితాలను గమనించాలని ఈ పుస్తకం చెబుతుంది. సుబ్బలక్ష్మి కుటుంబంలో ఆడవాళ్ళకి ఎంతో కొంత చదువు వుంది.

సుబ్బలక్ష్మి జీవితానికి పుస్తకరూపం ఇవ్వటానికి కొన్నైనా ఆధారాలు వున్నాయి. ఏ మాత్రం చదువులేని, ఎలాంటి ఆధారాలు లేని ఎంతో మంది సుబ్బలక్ష్ములు వున్నారు మన చుట్టూ. వారందరి జీవితాలను కూడా చరిత్రలో భాగం చెయ్యవలసిన అవసరాన్ని ఈ పుస్తకం గుర్తుచేస్తుంది. వారి అనుభవాలను స్వీకరించి కర్తవ్య బోధ చేస్తుంది. అనువాద పుస్తకం అయినా ఎక్కడా అలాంటి భావం కలగకుండా జ్యోతి చక్కటి అనువాదం చేశారు. ◆

# సహధర్మచారిణి



జపాన్ రక్తాన్ని విశ్లేషిస్తే దానిలో స్పష్టంగా గోచరించేది నిజాయితీ అని కొందరు తత్వవేత్తలు చెప్పారు. మరికొన్నింట కష్టించేతత్వం, దేశభక్తి వంటి లక్షణాలున్నాయని చెప్పారు. భారతదేశం ప్రపంచ ఆధ్యాత్మికతకు సూదంటురాయి అని కొందరు ప్రకటించారు. అది ఆ దేశ జాతీయతకు చెందిన విషయం. ఆంధ్రుల పూర్వ గాధలు ఆంధ్ర పురాణాల్లో ఒక జాతి జీవనాడిని పట్టుకుంటే జాతీయత బోధపడుతుందని మధునా పంతులుగారు చెప్పారు. గోదావరి నీరు తాగితే కవిత్వం అబ్బుతుందని కొందరు కవుల నమ్మకం. కావేరీ జలాలు తాగితే సరిగమలు గొంతులో పల్లవిస్తాయని మరికొందరి నమ్మకం. ఇలా ఒక్కో ప్రాంతానికి ఒక్కొక ప్రత్యేకత చెప్పారు మనవాళ్ళు. మరొకచోట నుంచి గడపకాక వీర సైనికుడు ఉద్భవించి జాతి పౌరుషానికి ప్రతీకగా నిలుస్తాడు. నేడు భారత సైన్యంలో చేరిన కాశ్మీరీ యువతి నిఖితా కౌర్ పెళ్లయిన 9 నెలలకే పుల్వామా మారుణహోమంలో భర్త మేజర్ విభూతి శంకర్ బలైపోయారు. ఆ సందర్భంగా నిఖితా ధరించింది తెల్లచీర కాదు. సైనిక యోధ దుస్తులు. భర్త కర్తవ్యాన్ని పూర్తి చేస్తానంటూ సైన్యంలో చేరి భారత జెండా చేపట్టారు. బహుళజాతి సంస్థలో ఏసీ గదిలో కూర్చుని పెద్ద మొత్తంలో జీతాన్ని అందుకునే ఆమె ఆ ఉద్యోగాన్ని వదిలిపెట్టి సర్వీస్ కమిషన్ పరీక్షలు రాసి సైన్యానికి ఎంపికై భర్త పూర్తి చేయలేకపోయిన బాధ్యతలను తాను పూర్తి చేస్తానని ఎంచుకున్నారు. పురాణాల్లో సతీసహగమనం గురించి అందరం విన్నాం. కానీ ఈమె ఈ సహగమనం అనే మాటకు సరికొత్త నిర్వచనం ఇచ్చారు. సహధర్మచారిణి అనే పదానికి నిదర్శనంగా మారి భర్త ఆశయాన్ని ఎవరెస్ట్ ఎత్తుకు పెంచారు. ఈమె కదా సహధర్మచారిణి. ◆

పి.జ్యోతి

రోడ్ల మీద అడుక్కునే పిల్లలను చూసినప్పుడు ఏం అనిపిస్తుంది. లేదా అనాథాశ్రమాల్లో పిల్లలను చూసినప్పుడు కలిగే ఫీలింగ్ ఏంటీ? అసలు తల్లి తన బిడ్డను ఎందుకు వదిలేస్తుంది? పేగు బంధాన్ని మించిన సామాజిక సూత్రాలు ఈ ప్రపంచంలో కుంతీ కాలం నుండి చూస్తూనే ఉన్నాం. మాతృత్వానికి కూడా సెక్యూరిటీ లేకపోతే, సామాజిక ఆమోదం లేకపోతే దాని పవిత్రత మాయమవుతుంది అన్నది ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకోకపో యినా ఒక చేదు నిజం. అందుకే నా వరకు ఈ పవిత్రత అనే పదాలు పెద్ద అబద్ధాలు అనిపిస్తాయి. భారత దేశంలో సగటున ఒక్క రోజుకు సుమారు 270 మంది పిల్లలు ఆసుపత్రులలో వదిలేయ బడు తున్నారని వింటే మనం ఎటువంటి పరిస్థితులలో బతుకుతున్నామో అర్థం అవట్లేదు. అలా రోడ్డు మీద బతుకుతున్న పిల్లల కథే ఈ 'థ్యాంక్స్ మా'.




# 'థ్యాంక్స్ మా'!

అమ్మ ఎవరో తెలీని ఒక వీధి బాలుడు నిరంతరం తన తల్లి గురించి ఆలోచిస్తూ ఉంటాడు. అతని తోటి వీధి బాలలకు తల్లి తండ్రులతో గడిపిన అనుభవం ఉంది. వారు పేదరికం కారణంగా చిల్లర దొంగలుగా మారారు. అయితే ఈ పిల్లవాడు మాత్రం ఎవరో వదిలేస్తే రోడ్డు మీద పెరిగిన బిడ్డ. తనను తల్లి వదిలేసిన హాస్పిటల్‌కి వెళ్ళి అక్కడి వాచ్‌మాన్‌ను తన తల్లి గురించి అడుగుతూ తనను వెతుకుతూ ఎవరైనా వచ్చారా అని కనుక్కుంటూ ఉంటాడు. తన తల్లి తన కోసం వెతుకుతుంటూ ఉంటుందని ఎప్పటికైనా ఆమెను కలవాలని అతని ఆశ.

ఒక దొంగతనం కేసులో జువెనైల్ హోమ్‌లో గడపవలసి వస్తుంది ఈ అబ్బాయికి. అక్కడి వార్డన్ మగపిల్లలను తన లైంగిక వాంఛలకి వాడుకుంటూ ఉంటాడు. అక్కడి నుండి పారిపోతున్నప్పుడు ఈ అబ్బాయి అప్పుడే కారులో వచ్చి ఆ హోమ్ మెట్ల మీద ఒక రెండు రోజుల బిడ్డను ఒకామె వదిలివేసి వెళ్ళడం చూస్తాడు. కుక్కలు గాయపరిచే లోపల అ బిడ్డను కాపాడాతాడు. అప్పటి నుండి ఆ బిడ్డను తల్లికి అప్పజెప్పాలనేదే ఆ అబ్బాయి ప్రయత్నం.

అతని ప్రయాణంలో ఎన్నో భయంకర విషయాలను చూస్తాడు. పసిపిల్లలపై జరుగుతున్న వ్యాపారం. ఆ బిడ్డ కోసం హిజ్రాల పోటీ, వ్యభిచారులు కూడా మగ బిడ్డ అని ఆ పసిబిడ్డను స్వీకరించలేకపోవడం, వ్యభిచార గృహాలలో స్త్రీల పరిస్థితి, అమ్ముడవుతున్న ఆడ పిల్లలు, భార్యల చాటున వ్యభిచరిస్తున్న భర్తలు, చివరకు అ బిడ్డ తల్లి దగ్గరకు వెళ్తే ఆమె ఘోరమైన స్థితి అతనికి అంత చిన్నతనంలోనే అర్థం అవడం, బిడ్డలను వదిలేసే తల్లులందరి కథ ఒకటే కాదన్నది ఆ చిన్నతనంలోనే తెలియడం ఈ సినిమా మూల కథ.

అతని సొంత తల్లి కూడా రోడ్డుపై కనిపిస్తుంది, కాని ఆమె ఎప్పటికీ తన బిడ్డను చేరలేదు. ఈ అబ్బాయి వరుసగా హాస్పిటల్‌కు వెళుతూనే ఉంటాడు. చాలా బలమైన సంభాషణలతో సమాజంలో ఎన్నో చీకటి కోణాలను దర్శకులు ఈ సినిమాలో చూపించారు. రోడ్డు పై పడేయబడ్డ ఆ చిన్న పిల్లవాడికి

ఎవరూ పేరు పెట్టకపోతే అతన్ని అందరూ మున్సిపాలిటి అని పిలుస్తారు.

పేరే లేని ఆ బిడ్డ మరో చిన్న బిడ్డ క్షేమం కోసం పాటుపడడం అతనికి క్రిష్ అని పేరు పెట్టుకోవడం, అలాంటి వీధి బిడ్డల భవిష్యత్తు పట్ల ఎన్నో ఆలోచనలను రేకెత్తిస్తుంది. కొంత డ్రామా జోడించినా, వేశ్యా వృత్తి, చైల్డ్ అబ్యూజ్, లైంగిక హింస, ఇలాంటి ఎన్నో సున్నిత మైన అంశాలను చర్చిస్తూ ఈ సినిమా ముందుకు వెళుతుంది.

సురక్షితంగా తల్లి ఒడిలో పెరుగుతున్న పిల్లలు నిత్యం థ్యాంక్స్ మా అని చెప్పుకోవలసిన పరిస్థితులు మన చుట్టూ ఉన్నాయని మాతృప్రేమను అనుభవించడం అందరికీ సహజం కాదనే నగ్న సత్యాన్ని చూపిన సినిమా ఇది. ఇందులో మున్సిపాలిటిగా నటించిన బాలుడి పేరు షామ్స్ పటేల్. అతనికి ఉత్తమ బాల నటుడిగా జాతీయ పురస్కారం లభించింది ఈ సినిమా తో. ఇర్ఫాన్ కమల్ రాసి దర్శకత్వం వహించిన ఈ సినిమా చూడకపోతే యూట్యూబ్‌లో ఉంది చూడండి. చాలా మంచి చిత్రం అని ఒప్పుకుంటాం. ఆ రెండు రోజుల బిడ్డ అస్సలు ఏడవకుండా అన్ని గంటలు ఉండడం ఒక్కటే కాస్త అసహజంగా అనిపించినా సినిమా అంతా చాలా ప్రాక్టికల్ అప్రోచ్‌తోనే తీసారని చెప్పవచ్చు.

**అలాగే బిడ్డను కావాలని వదిలేసే తల్లులతో పాటు బిడ్డ లేకపోతే బ్రతకలేని తల్లులు కూడా కనిపిస్తారు. వివాహం వారికి బిడ్డ కోసం అంతగా దు:ఖపడే స్వేచ్ఛను ఇస్తే, వివాహం కాకుండా పుట్టిన బిడ్డలకు ఆ కన్నీళ్ళూ కూడా లభ్యం కాకపోవడం, వారు చేయని తప్పుకి జీవితాంతం ఒంటరిగా, ఘోరమైన పరిస్థితుల మధ్య బ్రతకడం ఎంత అన్యాయం అన్న ఆలోచన కలుగుతూ ఉంటుంది.**

బిడ్డ కోసం ఏడుస్తున్న ఒక తల్లిని చూసి మున్సిపాలిటీ తన కోసం కూడా తన తల్లి అలాగే ఏడుస్తూందేమో అనుకుని తృప్తి పడుతూ ఉంటాడు, చివరకు కృష్ తల్లి పరిస్థితి చూసాక అతనిలో ఆ ఆశ కూడా చనిపోతుంది. కాని హాస్పిటల్‌కి ప్రతి వారం వెళ్ళీ వాచ్‌మెన్‌తో మాట్లాడడం మాత్రం మానడు. తన తల్లికి తనకు ఉన్న ఏకైక లింక్ ఆ హాస్పిటల్ మెట్లే అన్న ఫీలింగ్ ఆ చిన్న పిల్లవాడిలో కనిపిస్తుంది. ◆

## మూడో డైమెన్షన్

- ప్రగతి

జిగిబిగి అల్లికలో, పరచుకున్న రంగవల్లికలో
రెండే అక్షాల వెంబడి ఎప్పుడూ
కాగితాన్ని అంటుకునే ఉండాలా అని
కవిత్వానికి అంతులేని అసంతృప్తి.
నిటారుగా నిలబెట్టలేవా అంటూ
నిత్యం నన్ను నిలదీస్తూనే ఉంటుంది.
అవునూ, కవిత్వాన్ని
ఎలా నిటారుగా నిలబెట్టాలి?
మూడో అక్షంలో అక్షరాలను ఎలా సర్దాలి?
కళాత్మకంగా బోర్లించిన
లావోపాలా కప్పుల్లాగానా?
కింద మంట కాలుస్తున్నా
లోపల సలసలా కాగుతున్నా
తళతళ నవ్వులు మెరిసే స్టెయిన్లెస్ స్టీలు
గిన్నెల్లాగానా? "అవేవీ వొద్దు!"
కాగితపు లోతుల్లోంచి అక్షరం అరిచింది.
"చక్కని మొక్కలా నిలబెట్టు,
పచ్చని పుస్తకాలు పూయిస్తా!"
"అచ్చు నీలాగా నిటారుగా నిలబెట్టు,
తలెగరేసి నీపేరు నిలబెడతా!"

## నే మరచిన సంధ్య

- రోహిణి బొమ్మన

సంధ్యా సమయం
కెంజాయపు రంగు పులుముకున్న ఆకాశం
ఆకాశమే హద్దు గా స్వేచ్ఛా విహారంలో విహంగాలు
తమ అందాలతో పరవశింప చేసే పూబాలలు
ఎన్నెన్నో అందమైన సాయంత్రాలు
ఎలా గమనించలేక పోయాను ఇన్నాళ్ళు
శిశువు గా తల్లి పొత్తిళ్ళలో చూసా
ప్రకృతిలోని వెచ్చదనాన్ని
బహుశ అందుకే గమనించ లేదేమో
చదువు సంధ్యల బరువుల మధ్య
గమనించలేదు ఈ సంధ్యా చిత్రాన్ని
యవ్వనపు మధురోహలలో తేలుతూ
ప్రియ బాంధవుడి ఆలింగనంలో కరిగిపోయే వేళ
మైమరపులో ఈ సంధ్యా సుందరిని గమనించలేదేమో
నడమంత్రపు సిరి వంటి
ఆ వంటింటి సామ్రాజ్యపాలనలో పడి
మరచి పోయాను ఈ సంధ్యా సమీరాలను
అసలు కన్నా వడ్డీ ముద్దని
వారి ఆలనాపాలనలో షష్టి పూర్తయి
ఎన్నో అందమైన సంధ్యా సమయాలను
గమనించకనే నా సంధ్య ఆరంభమైనది

## సుందరయ్య వర్ధంతి సభలు

- మే 19 సుందరయ్య వర్ధంతి సందర్భంగా నెల్లూరులో పేద, గిరిజన కుటుంబాలకు ఐద్వా అధ్యక్షురాలు ఎస్.వరలక్ష్మీ దుస్తులు అందించారు.




- కర్నూలులో సుందరయ్య వర్ధంతి కార్యక్రమం సుందరయ్య భవనంలో ఐద్వా కమిటీ నిర్వహించింది.
- నెల్లూరు జిల్లా మర్రిపాడులోని సీపీఎం కార్యాలయంలో సుందరయ్య వర్ధంతి సభను సీఐటీయూ, ఐద్వా ఆధ్వర్యంలో నిర్వహించారు.
- నర్సాపురం 19వ వార్డులో సుందరయ్య వర్ధంతి సభ నిర్వహించారు.
- విశాఖ సిటీ 69 డివిజన్‌లోని షీలానగర్‌లో సుందరయ్య వర్ధంతి సభ జరిపారు.
- విశాఖ జిల్లా కశింకోటలో సుందరయ్య వర్ధంతిని ఐద్వా, సిఐటియులు సంయుక్తంగా నిర్వహించారు. - తూర్పు గోదావరి జిల్లా ఎటపాకలో సీపీఎం ఆధ్వర్యంలో జరిగిన సుందరయ్య వర్ధంతి కార్యక్రమంలో ఐద్వా మహిళలు పాల్గొన్నారు. ఐ.పద్మావతి ప్రసంగించారు.
- కృష్ణా జిల్లా గుడివాడలో ఐద్వా ఆధ్వర్యంలో సుందరయ్య విగ్రహానికి పూల మాలలు వేసి నివాళులర్పించారు. ఈ కార్యక్రమంలో కె.పద్మ, పాల్గొన్నారు.

## మేడే సందర్భంగా..

- తూర్పుగోదావరి జిల్లా అమలాపురంలోని నారాయణపేటలో ఐద్వా సభ్యులు మేడే సందర్భంగా జెండా ఆవిష్కరించారు.
- నెల్లూరు సుందరయ్య నగర్‌లో 24వ డివిజన్‌లో మేడే సందర్భంగా జెండా ఆవిష్కరణ జరిపారు. ఈ కార్యక్రమంలో ఐద్వా సభ్యులు దాసరి సుజాత పాల్గొన్నారు.
- కృష్ణా జిల్లా గుడివాడలో ఐద్వా ఆధ్వర్యంలో మేడే జెండా ఆవిష్కరించారు.

## వ్యవసాయ నల్ల చట్టాలకు నిరసనగా..

- తూర్పుగోదావరి జిల్లా అమలాపురంలో ఈదరపల్లి, నారాయణపేట, మామిడికుదురు, ఉప్పలగుప్తం గ్రామాలలో నల్ల చట్టాలు రద్దు చేయాలని ఐద్వా ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమాలు జరిపారు.
-నర్సీపట్నం మండలంలో రైతులకు మద్దతుగా, నల్ల చట్టాలకు నిరసనగా మే 26న 2 చోట్ల కార్యక్రమాలు జరిగాయి.
-ఏజెన్సీలో అరకు, అనంతగిరి, హుకుంపేట, పెదబయలు మండలాల నుండి మే 26న నల్ల చట్టాలకు నిరసనగా, రైతులకు మద్దతుగా మూడుచోట్ల కార్యక్రమాలు జరిగాయి.
- మే 26న రైతులకు మద్దతుగా మూడుచోట్ల కార్యక్రమాలు జరిగాయి.
- మర్రిపాడు సెంటర్‌లో రైతులకు మద్దతుగా నిరసన కార్యక్రమం చేశారు.
-గుంటూరు జిల్లా వినుకొండ, సత్తెనపల్లిలలో నల్లచట్టాలు రద్దు చేయాలని ధర్నా నిర్వహించారు. నల్ల చట్టాలపై జీవో ప్రతులను దగ్ధం చేశారు.
- కర్నూలులో బ్లాక్‌డే సందర్భంగా నాలుగు సెంటర్లలో నిరసన ప్రదర్శన జరిపారు.
- ఐద్వా ఆధ్వర్యంలో అమలాపురం ఉప్పలగుప్తం మండలంలో నిరసన ప్రదర్శన జరిపారు.
- తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో బ్లాక్‌డే సందర్భంగా నిరసన కార్యక్రమాలు 15 చోట్ల జరిపారు.
- కాకినాడలోని 35వార్డులో బ్లాక్‌డే సందర్భంగా నల్ల జెండాలతో నిరసన ప్రదర్శన జరిపారు.
- అరకులోని కొత్తవలస గ్రామంలో ఓల్డ్ పోస్టాఫీస్ కాలనీలో బ్లాక్‌డే సందర్భంగా నిరసన ప్రదర్శన జరిపారు.
- నల్ల చట్టాలు రద్దు చేయాలని ఆరునెలలుగా పోరాడుతున్న రైతులకు మద్దతుగా ఐద్వా నరసాపురంలో నల్ల జెండాలతో నిరసన ప్రదర్శన జరిపారు.
- అనంతపురంలో బ్లాక్‌డే సందర్భంగా నల్ల చట్టాలకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శన జరిపారు .
- విశాఖ జిల్లా హుకుంపేటలో బ్లాక్ డే సందర్భంగా నిరసన ప్రదర్శన జరిపారు.
- పశ్చిమ గోదావరిజిల్లా చించినాడలో బ్లాక్ డే సందర్భంగా నిరసన ప్రదర్శన జరిపారు.
- తూర్పుగోదావరి జిల్లా ఎటపాక గుండాల కాలనీలో ఐద్వా కమిటీ ఆధ్వర్యంలోనూ నిరసన ప్రదర్శన చేపట్టారు. ఈ కార్యక్రమంలో ఐ.పద్మ, సావిత్రి, కల్పన, సరోజిని, శిరీష, ప్రభ, రజనీ పాల్గొన్నారు.
- తిరుపతిలో రైతు వ్యతిరేక చట్టాలకు నిరసనగా ప్రదర్శన నిర్వహించారు.
- నల్ల చట్టాలు రద్దు చేయాలని బ్లాక్‌డే సందర్భంగా నెల్లూరు శెట్టిగుంట రోడ్డు సెంటర్‌లో నిరసన ప్రదర్శన జరిపారు.




## ఐసోలేషన్ కేంద్రాలకు విరాళాలు

- కొవిడ్ బాధితులకు వైద్య సదుపాయాలు కల్పిస్తూ ప్రజాసంఘాలు రాష్ట్ర వ్యాప్తింగా ఐసోలేషన్ కేంద్రాలు ఏర్పాటు చేసి వైద్య సేవలు అందించారు.
- పిడుగురాళ్ల ఐసోలేషన్ కేంద్రానికి ఐద్వా నాయకురాలు అమరమ్మ కుమారుడు, గద్దె ఉమశ్రీ కుమార్తె విరాళం అందించారు.
- తూర్పు గోదావరి జిల్లా చింతూరులో సున్నం రాజయ్య ట్రస్టు ఆధ్వర్యంలో జరుగుతున్న కొవిడ్ ఐసోలేషన్ కేంద్రానికి ఎటపాక ఐద్వా కమిటీ పండ్లు అందించారు. ఈ కార్యక్రమంలో ఐద్వా జిల్లా కార్యదర్శి తులసీ, ట్రస్టు నిర్వహణా కమిటీ సభ్యులు అరుణ్, కె ప్రసన్న, నాగేశ్వరరావు, ఐవి, సురేష్, రాము, పద్మ, నాగమణి, సావిత్రమ్మ పాల్గొన్నారు.
- ఒంగోలులో ఎల్‌బిజి భవన్‌లో ప్రజా సంఘాలు, దాచూరి రామిరెడ్డి విజ్ఞాన కేంద్రం సంయుక్తంగా ఏర్పాటు చేసిన కొవిడ్ ఐసోలేషన్ కేంద్రంలో బాధితులకు ఐద్వా నాయకులు భోజన ఏర్పాట్లలో పాల్గొన్నారు.
- విజయవాడలో కొవిడ్ కేర్ సెంటర్‌లో కరోనా బాధితులకు ఐద్వా నాయకులు ఐద్వా నాయకులు భోజన ఏర్పాట్ల బాధ్యతలు నిర్వహిస్తున్నారు.
- కర్నూలు వీకర్ సెక్షన్ కాలనీలో పొదుపు గ్రూపుల ఐక్య సంఘాల నాయకులు కరోనా బాధితుల కోసం సుందరయ్య స్ఫూర్తి కేంద్రం నిర్వహిస్తున్న ఐసోలేషన్ కేంద్రానికి పొదుపు లక్ష్మి గ్రూపుల మహిళలు విరాళాలు అందించారు.
- అనంతపురం, తిరుపతి, కాకినాడ, విశాఖ తదితర కేంద్రాల్లో ఐద్వా నాయకులు సేవల్లో భాగస్వాములయ్యారు.
- విశాఖ స్టీల్ జోన్ ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో కరోనా బాధితులకు ఆర్థిక సహాయం అందించారు.

## లక్ష్మీ అపర్ణకు న్యాయం చేయాలని...




విశాఖ అపోలో హాస్పిటల్‌లో విధులు పూర్తి చేసుకొని ఇంటికి వెళు తున్న యువతిపై నడిరోడ్డులో పోలీసుల దౌర్జన్యానికి నిరసన తెలిపి లక్ష్మీ అపర్ణకు ఐద్వా నాయకులు మద్దతుగా నిలిచారు. విశాఖపట్నం అంబేద్కర్ విగ్రహం వద్ద జరిగిన నిరసనలో రాష్ట్ర అధ్యక్షురాలు ప్రభావతి, శ్రామిక మహిళా నాయకురాలు మణి, ఇతర సంఘాల నాయకులు పాల్గొన్నారు. గాంధీ బొమ్మవద్ద, అంబేద్కర్ బొమ్మ వద్ద శ్రామిక మహిళ మరియు విద్యార్థి సంఘం, దళిత, యువజన, కార్మిక, విద్యార్థి సంఘాలతో కలిసి నిరసన తెలిపారు. లక్ష్మీ అపర్ణను రాష్ట్ర మహిళా నాయకులు కలిసి మద్దతు తెలిపారు. - లక్ష్మీ అపర్ణపై పోలీసులు పెట్టిన తప్పుడు కేసులు ఎత్తివేయాలని, అక్రమంగా ఆమెను పోలీస్‌స్టేషన్‌కు తీసుకెళ్లిన పోలీసులపై కేసు నమోదు చేయాలని కోరుతూ విజయవాడలో ఐద్వా ఆధ్వర్యంలో ఆన్‌లైన్ రౌండ్‌టేబుల్ సమావేశం జరిగింది. 32 ప్రజా సంఘాలతో కలిసి డీజీపీ గౌతమ్ సవాంగ్‌కు మెమోరాండం అందించారు. - పశ్చిమ గుంటూరు జిల్లా వినుకొండలోనూ ఐద్వా నాయకులు లక్ష్మీ అపర్ణకు న్యాయం చేయాలని, పోలీసుల చర్యలను ఖండిస్తూ నిరసన చేపట్టారు. ఈ కార్యక్రమంలో ఐద్వా నాయకురాలు రంజాన్‌బీ, సరభి, కొండమ్మ, ఈశ్వరమ్మ పాల్గొన్నారు. - లక్ష్మీ అపర్ణకు న్యాయం చేయాలని, పోలీసులపై చర్యలు తీసుకోవాలని కాకినాడలో నిరసన ప్రదర్శన జరిపారు. - విశాఖ గాజువాక డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో నిరసన ప్రదర్శన జరిపారు. కె సంతోషం, జి లక్ష్మి, స్వర్ణలత పాల్గొన్నారు. - గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో మహిళా సంఘం ఆధ్వర్యంలో జరిగిన నిరసనలో గద్దె ఉమశ్రీ, ధరణికోట విమల, రజనీ, మల్లేశ్వరి, మునగ జ్యోతి, జ్యోతి, ఆయేషా, నాగలక్ష్మి పాల్గొన్నారు. - పోలీసులపై చర్యలు తీసుకోవాలని ఎటపాక ఐద్వా మండల కమిటీ ఆధ్వర్యంలో నిరసన తెలిపారు. ఈ కార్యక్రమంలో ఐద్వా జిల్లా కమిటీ సభ్యురాలు పద్మ, సావిత్రి, కల్పన, సరోజినీ, శిరీష, ప్రభ, రజనీ పాల్గొన్నారు. - లక్ష్మీ అపర్ణపై పోలీసులు పెట్టిన అక్రమ కేసులు ఎత్తివేయాలని, ఆమెకు న్యాయం జరగాలని, పోలీసులపై కఠిన చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేస్తూ ఐద్వా సంఘం పశ్చిమ గోదావరి జిల్లా తణుకులో నిరసన కార్యక్రమం చేపట్టింది. ఈ కార్యక్రమంలో జిల్లా కమిటీ సభ్యులు కే.నాగరత్నం, సిహెచ్ అన్నపూర్ణ, వార్డు కమిటీ సభ్యులు భార్గవి, మంగతాయారు, కామాక్షి పాల్గొన్నారు. - లక్ష్మీ అపర్ణపై పోలీసుల దౌర్జన్యానికి నిరసనగా పోలీసులపై చర్యలు తీసుకోవాలని తిరుపతిలో ఐద్వా ఆధ్వర్యంలో నిరసన ప్రదర్శన జరిపారు. -లక్ష్మీ అపర్ణ కు న్యాయం జరగాలని గాజువాక మద్దిలపాలెం, కైలాసపురం మరియు నగర కేంద్రాల్లో వివిధ కార్యక్రమాలు జరిగాయి.

## ఉపాధి హామీ పథకాన్ని

## పట్టాణాలకూ విస్తరించాలని

ఉపాధి హామీ పథకాన్ని పట్టణాలకు విస్తరించాని ఐద్వా ఆధ్వర్యంలో అమలాపురం ఉప్పలగుప్తం మండలంలో నిరసన కార్యక్రమాలు జరిగాయి.

## కేరళ మాదరిగా 16 రకాల

## నిత్యావసరాలు ఇవ్వాలని కోరుతూ...

- తూర్పుగోదావరి జిల్లా అమలాపురంలో ఈదరపల్లి, నారాయణపేట, మామిడికుదురు, ఉప్పలగుప్తం గ్రామాలలో కేరళలో లాగా ఇక్కడ కూడా 16 రకాల నిత్యావసర సరుకులు ప్రభుత్వం ఇవ్వాలని ఉపాధి హామీ పథకాన్ని పట్టణాలకు విస్తరించాలని ఐద్వా ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమాలు జరిపారు.

- తిరుపతి పట్టణ ప్రాంతాల్లో ఉపాధి హామీ పథకం అమలు చేయాలని నిత్యావసర వస్తువుల ధరలు తగ్గించాలని తిరుపతిలోని మున్సిపల్ కార్యాలయం వద్ద ప్రజా సంఘాల ఆధ్వర్యంలో నిరసన ప్రదర్శన చేశారు.

## చెత్త పన్నుకు వ్యతిరేకంగా నిరసనలు

- ప్రజలపై భారాలు పెంచుతూ వేసిన చెత్త పన్నును వ్యతిరేకిస్తూ ఆస్తి ఆధారిత ఇంటి పన్నును రద్దు చేయాలని రాష్ట్రంలో అనేక ప్రాంతాల్లో ఐద్వా, ప్రజా సంఘాల ఆధ్వర్యంలో నిరసన తెలిపారు.



తిరుపతిలో..

## అత్యాచారాలు...

- మైలవరం వద్ద తోలుకోడు గ్రామంలో 45 ఏళ్లుపైబడిన నాగేంద్రమ్మ అనే దళిత ఒంటరి మహిళను అదే గ్రామానికి చెందిన ఇద్దరు యువకులు మద్యం మత్తులో ఆమెపై అత్యాచారం చేసి చంపేశారు. ఐద్వా వెస్ట్ కృష్ణా కమిటీ సహాయ కార్యదర్శులైన సరోజ, ఝాన్సీ, ఉపాధ్యక్షురాలు బేబీరాణి, దేవీకుమారి బాధిత కుటుంబాన్ని పరామర్శించారు. నిందితులను కఠినంగా శిక్షించాలని, ఆ కటుంబానికి నష్టపరిహారం చెల్లించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు.

- చింతల చెరువులో ప్రమోన్మాది చేతిలో మోసపోయిన అతి దారుణం హత్యకు గరైన శిరీష కుటుంబానికి రూ. 10 లక్షలు ఎక్స్‌గ్రేషియా కల్పించాలని, ఉన్మాదిని బహిరంగంగా శిక్షించాలని కడప జిల్లా పోరుమామిళ్లలో అంబేద్కర్ సర్కిల్ వద్ద ఐద్వా జిల్లా కమిటీ సభ్యులు సుబ్బమ్మ ఆధ్వర్యంలో ధర్నా చేశారు.



నెల్లూరులో..

## లైంగిక వేధింపులకు నిరసనగా...

- నెల్లూరులోని వైద్య కళాశాల వైద్య విద్యార్థినిపై జిజిహెచ్ సూపరింటెండెంట్ లైంగిక వేధింపులకు పాల్పడటంపై విచారణ జరిపి నిందితునికి శిక్ష పడేలా చేయాలని కోరుతూ కలెక్టర్‌కు ఐద్వా నాయకులు వరలక్ష్మీ, షాహినాబేగం, షంషాద్ రిజ్వానా వినతి పత్రం ఇచ్చారు.

-నర్సీపట్నం మండలంలో రెండు ఏరియాలలో జరిగిన అత్యాచార ఘటనలపై పై అధికారులకు వినతిపత్రం ఇవ్వడం జరిగినది.

**శిరీష కుటుంబానికి ప్రభుత్వ సాయం కోరుతూ...**

- కడప జిల్లా బద్వేలు మండలం చింతలచెరువు గ్రామంలో ప్రేమోన్మాది చేతిలో దారుణంగా హత్యకు గురైన శిరీష కుటుంబాన్ని ఐద్వా జిల్లా కార్యదర్శి సుబ్బమ్మ పరామర్శించారు. అనంతరం స్థానిక సిఐటియు కార్యాలయంలో ఆవాజ్ జిల్లా అధ్యక్షులు చాంద్‌బాషాతో కలిసి విలేకర్ల సమావేశం నిర్వహించారు. నిరుపేద కుటుంబంలో పుట్టిన శిరీష కష్టపడి డిగ్రీ వరకు చదివి ఇంటి పనుల్లో, పొలం పనుల్లో తల్లిదండ్రులకు చేదోడువాదోడుగా ఉండేది. అటువంటి యువతిని శాడిస్టు యువకుడు చరణ్ ఏడాదిగా వేధిస్తున్నాడు. ఈ క్రమంలో ఆమె పెళ్లికి ఇష్టపడనందున పొలంలో పని చేస్తున్న శిరీషను గొంతుకోసి హత్య చేశాడు. శిరీష కుటుంబానికి ప్రభుత్వ సహాయం అందే వరకు ఐద్వా, ఆవాజ్ కమిటీ సభ్యులు ఆందోళన చేస్తామని తెలిపారు.

## కకోలి పాశవిక హత్యకు ఖండన



పశ్చిమబెంగాల్ రాష్ట్రంలో ఎన్నికల తదనంతరం హింసాకాండ చెలరేగింది. అసెంబ్లీ ఎన్నికల్లో చురుకుగా పని చేసిన బర్ద్వాన్ జిల్లా జమాల్‌పూర్‌కు చెందిన సీపీఎం, ఐద్వా నాయకురాలు కకోలి క్షేత్రపాల్‌ని తృణమూల్ గుండాలు ఆమె ఇంట్లో ఉండగానే దాడి చేసి హత్య చేశారు. ఈ దుర్మార్గాన్ని ఐద్వా, జాతీయ మహిళా సమాఖ్య, ప్రగతిశీల మహిళా సంఘం, చైతన్య మహిళా సంఘం రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు నాయకులు డి.రమాదేవి, పి దుర్గ భవాని,ఎమ్. లక్ష్మి, నాగమణి, విష్ణు, రాధా, ప్రభావతి, గంగా భవాని జయలక్ష్మి ఖండించారు.

## కడ వరకూ ఉద్యమాలతోనే సులోచనమ్మ



రాయుడు (కొత్తపల్లి) సులోచనమ్మ అమృతలూరు నివాసి. తండ్రి ఉద్యోగ రీత్యా పచ్చలతాడిపర్రులో సుదీర్ఘ కాలం నివాసమున్నారు. అప్పట్లో అమృతలూరు, పచ్చలతాడిపర్రు గ్రామాలు కమ్యూనిస్టు భావజాలానికి, ఉద్యమాలకు పట్టుగొమ్మలు. మొవ్వ అంకమ్మ మాస్టారు ద్వారా అభ్యుదయ, సాహిత్య పథంలోకి ప్రవేశించారు. తనకు తెలియకుండానే కమ్యూనిజం నరనరాల్లోకి పాకిపోయింది. వివాహ అనంతరం భర్త రాయుడు సాంబశివరావు ఉద్యోగం రీత్యా గుంటూరు, బాపట్ల, నెల్లూరు, విజయవాడల్లో నివాసం ఉంటున్నారు. స్థానిక పార్టీ, మహిళా ఉద్యమాల్లో పాల్గొనేవారు. ఒకసారి ఒంగోలులో పార్టీ తరుపున వార్డుకు పోటీ చేశారు. మహిళా సంఘాల్లో పాల్గొన్నారు. మోటూరు హనుమంతరావు, ఉదయం గార్లతో చివరి వరకూ సంబంధాలు ఉండేవి. కుటుంబ సభ్యులందరినీ డాక్టర్లుగా తీర్చిదిద్దారు. ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా చివరి వరకూ సీపీఎంతో ఉన్నారు. చదువు హైస్కూల్‌కే పరిమితమైనా ప్రజాశక్తి, చైతన్యమానవి పుస్తకాలు చివరి వరకూ చదివేవారు. పరిచయమైన ప్రతి ఒక్కరితోనూ తలలో నాలుకలా కలిసిపోయేవారు. ఆమె 2020 మార్చి 7వ తేదీ అనారోగ్యంతో మరణించారు.

## మనోజకు ఐద్వా నివాళి



కందుకూరులో ఐద్వా, సిఐటియు నాయకురాలు మాగంటి మనోజ కరోనాతో మృతిచెందారు. కరోనా సోకడంతో చికిత్స కోసం ఒంగోలు రిమ్స్ వైద్యశాలలో చేరారు. కరోనా తీవ్రతతో తనువు చాలించారు. కందుకూరు ప్రాంత పేద ప్రజల కోసం అమె పలు ఉద్యమలలో పాల్గొన్నారు. పేదల సమస్యలపై అలుపెరుగని పోరాటాలు చేశారు. మాగంటి మనోజ, ప్రస్తుతం ఐద్వా కందుకూరు ప్రాంతీయ కమిటీ కార్యదరిగా ఉన్నారు. అమె పట్టణంలోని పలు ప్రాంతాలలో పేదల నివాస స్థలాలు రావడంలో కృషి చేశారు. అంగన్‌వాడీ కార్యకర్తల సమస్యలపై కందుకూరు, కొండపి నియోజకవర్గాలలో పెద్ద ఉద్యమాలే చేపట్టారు. మహిళలపై జరిగే సంఘటనలపై వారికి న్యాయం జరిగే వరకు వెనకడుగు వేసే వారుకాదు. అటువంటి పోరాట శక్తి గల నాయకురాలు మరణించడం తీరని లోటని సిపిఎం, సీపీఐ, సిఐటియు, ఐద్వా నాయకులు తమ సంతాపం తెలియజేశారు.



కృష్ణా నదీతీరం తాడేపల్లి వద్ద అత్యాచారానికి గురైన నర్సింగ్ విద్యార్థినికి న్యాయం చేయాలని, నిందితులను కఠినంగా శిక్షించాలని ఐద్వా రాష్ట్ర కార్యదర్శి రమాదేవి, మహిళా సమాఖ్య రాష్ట్ర కార్యదర్శి దుర్గాభవానీ, తాడేపల్లి ఐద్వా నాయకురాలు శ్రీనివాసకుమారి డిమాండ్ చేశారు. ఘటనా ప్రదేశాన్ని పరిశీలించారు.

# అనాథల అమ్మ శేషమ్మ!



ప్రకాశం జిల్లా చీరాల ప్రాంతంలో కామ్రేడ్ శేషమ్మ ఒకరు. చదువులేక పోయిన ఐద్వా చీరాల డివిజన్ నాయకురాలిగా అనేక సంవత్సరాలు మహిళలకు సేవలందించారు.అనాథ మహిళలకు అండగా నిలిచారు. మహిళలకు కుటుంబ తగాదాలు పరిష్కరించారు. సంక్రాంతి వస్తుందంటే నెలరోజులు ముందుగానే ఆటలు పోటీలకు సిద్ధమై తెలిసినవారిని వదలకుండా గిఫ్టులు సెకరించి అనేక ప్రాంతాల్లో ఆటలు పోటీలు జరిపేవారు..ఎవరన్నా మేముఆటలపోటీలుజరపలేముఅంటే మేము గిఫ్టులు ఇస్తాము మీరు జరపండి అని ప్రోత్సాహించేవారు. చీరాల ప్రాంతంలో బీచ్ ఉన్నందున పార్టీ, ప్రజాసంఘాలు క్లాసులు ఎక్కువగా అక్కడే జరిగేవి. క్లాసులు జరిగిన ప్రతి సందర్భంలో కార్యకర్తలు ఆరోగ్యంగా ఉండాలని శేషమ్మ (ఐద్వా టీమ్) సొంతంగా వంటలు వండి రుచికరంగా దగ్గరుండి వడ్డించే వారు.వంట మనుషులును పెట్టకుండా పార్టీకి ఖర్చు తగ్గించేవాళ్ళు. చీరాల పార్టీ పనిమీద వచ్చిన ఏస్థాయి నాయకులైనా ఇంటికి పిలిచి ఆప్యాయంగా అన్నం పెట్టడం అంటే ఆమెకు ఎంతో సంతోషం...భర్త కొండయ్యగారు, సీపీఎం పార్టీ పూర్తికాలం కార్యకర్త. ఆయనచేసే ప్రతిపనిలో చేదోడుగా ఉంటూ పార్టీకి అనేకరకాల సేవలు అందించారు. కుమారుడు కిరణ్. ప్రజానాట్యమండలి కళాకారులు ప్రోత్సహించేవారు. ఇలా కుటుంబం మొత్తం సీపీఎం రాజకీయాలకు అంకితమై పనిచేశారు.. చేస్తున్నారు. కరోనాతో శేషమ్మ మరణం తీరని విషాదం. వారికి ఐద్వా జోహార్లు అర్పిస్తోంది.



మైథిలీ శివరామన్ సంస్మరణ సభ విజయవాడ ఎమ్బీవికేలో జరిగింది. ఈ సభలో సిపిఎం కేంద్ర కమిటీ సభ్యులు వి శ్రీనివాసరావు, ఐద్వా నాయకులు స్వరూపరాణి, రమాదేవి తదితరులు పాల్గొన్నారు. జూన్ 13వ తేదీ జరిగిన ఆన్లైన్ సభలో సుభాషిణీ ఆలీ, పుణ్యవతి, మల్లు లక్ష్మీ, ఆశా లత, హైమవతి, ప్రభావతి, రమాదేవి పాల్గొని ఆమె ప్రత్యేకతలను, సైద్ధాంతిక స్పష్టతను, త్యాగాలను,క్రషిని వివరించారు.



కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పెంచిన ఆస్తి పన్ను, చెత్తపై పన్నును రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ గుంటూరులో ఐద్వా ఆధ్వర్యంలో నిరసన ప్రదర్శన జరిగింది. మహిళలు ప్లకార్డులు ప్రదర్శించిన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకంగా నినాదాలు చేశారు.



విశాఖ రూరల్ ఉపాధిహామీ కూలీలందరికీ వ్యాక్సిన్ వేయాలని, పీపీఈ కిట్ ఇవ్వాలనీ, ప్రతి కుటుంబానికీ రూ.7500 చెల్లించాలని, 200 రోజులు పని కల్పించాలని ఐద్వాజిల్లా ఉపాధ్యక్షురాలు మాణిక్యం ఆధ్వర్యంలో 5 చెరువుల దగ్గర కూలీతో ధర్నా చేశారు.

## స్థానిక సమస్యలపై....

-స్టీల్ జోన్ కమిటీ ఆధ్వర్యంలో కోవిడ్ బాధితులకు సరుకుల పంపిణీ జరిగింది. విశాఖ రూరల్ పరవాడ మండలంలో కరోనా టెస్ట్ చేయాలని, అందరికీ 7500 రూపాయలు ప్రతి కుటుంబానికి వేయాలని, వ్యాక్సిన్ అందుబాటులో ఉంచాలని నిరసన కార్యక్రమం చేయడం జరిగింది. పదిమందితో ఉపాధి హామీ పనులు 200 రోజులు పెంచాలని, బకాయిలు చెల్లించాలని, మజ్జిగ పంపిణీ చేయాలని మెడికల్ కిట్ ఇవ్వాలని, ఆరు గ్రామాల్లో ఆరు చెరువుల వద్ద 700 మందితో నిరసన కార్యక్రమం చేశారు.

-నర్సీపట్నం మండలంలో కొవిడ్ సమస్యలు పరిష్కరించాలని ఆర్డీవోకు వినతిపత్రం ఇచ్చారు.

-విశాఖ రూరల్ పరవాడ మండలంలో కరోనా టెస్ట్‌లు చేయాలని, అందరికీ 7500 రూపాయలు ప్రతి కుటుంబానికి వేయాలని, వ్యాక్సిన్ అందుబాటులో ఉంచాలని నిరసన కార్యక్రమం చేయడం జరిగింది. పదిమందితో ఉపాధి హామీ పనులు 200 రోజులకు పెంచాలని, బకాయిలు చెల్లించాలని, మజ్జిగ పంపిణీ చేయాలని, మెడికల్ కిట్ ఇవ్వాలని ఆరు గ్రామాల్లో ఆరు చెరువుల వద్ద 700 మందితో నిరసన కార్యక్రమం చేశాం.

-గుంటూరు జిల్లా వినుకొండ, సత్తెనపల్లిలలో కొవిడ్ ఐసోలేషన్ కేంద్రాలు ప్రభుత్వమే ఏర్పాటు చేయాలని ఐద్వా డిమాండ్ చేసింది.

-గుంటూరు జిల్లా వినుకొండ, సత్తెనపల్లిలలో పెరిగిన పెట్రోలు ధరలకు వ్యతిరేకంగా జరిగిన నిరసన ప్రదర్శనలో ఐద్వా నాయకులు పాల్గొన్నారు.

- ఎటపాక గుండాల గ్రామ పంచాయతీలో ఇన్‌కంటాక్స్ ఎక్కువవడటం వల్ల, వ్యవసాయ


విశాఖ స్టీల్ జోన్..

కుటుంబాలకు సంవత్సరం నుంచి రేషన్ బియ్యం, ప్రభుత్వ పథకాలు అందక ఇబ్బంది పడుతున్నవారిని ఆదుకోవాలని ఐటీడీయే వద్ద, ఏపీవో వద్ద ఐద్వా సభ్యులు విన్నవించారు. ఈ కార్యక్రమంలో ఐద్వా గ్రామ కమిటీ సభ్యులు పద్మ, రెడ్డిమల్ల సావిత్రి, వెంకటమ్మ పాల్గొన్నారు.

- తూర్పుగోదావరి జిల్లా ఎటపాక మండలంలో కరోనా బాధితులకు నిత్యావసర వస్తువులు, పాలు, గుడ్లు, 25 కేజీల బియ్యం, ఆర్థికసాయం ప్రభుత్వం అందించాలని ఐద్వా మండల కమిటీ డిమాండ్ చేసింది.

- అనంతపురం పూర్తి లాక్‌డౌన్ వల్ల ఇబ్బందులు ఎదుర్కొంటున్న కూలీలు, రోడ్డు పక్కనున్న పేదలకు ఐద్వా నేతలు భోజనాలు అందించారు.

- తిరుపతిలో ప్రజాసంఘాలు, ఐద్వా భాగస్వామ్యంతో కొవిడ్ హెల్ప్ డెస్క్ ప్రారంభించారు. దీనికి మంచి స్పందన లభించింది. గుర్తించిన సమస్యలపై ప్రతిరోజూ హెల్ప్‌డెస్క్ ఒక కార్యక్రమం నిర్వహించి సంబంధిత అధికారులకు వినతి పత్రం అందిస్తున్నారు.

- తిరుపతిలో ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో కరోనా సమయంలో బాలింతలకు, గర్భిణులకు ప్రత్యేక వైద్య సదుపాయాలు కల్పించాలని, అందరికీ ఉచితంగా టీకా ప్రభుత్వం అందించాలనీ, కొవిడ్ పరీక్షలు విస్తృతంగా జరపాలని డిమాండ్ చేశారు.

- విశాఖలోని పైడిమాంబ కాలనీలో 17 మందితో కుట్టు మిషన్ సెంటర్ ప్రారంభించారు.

- తూర్పుగోదావరి జిల్లాలో కొవిడ్ సహాయ చర్యలు చేపట్టాలని కోరుతూ ఐదు చోట్ల కార్యక్రమాలు చేశారు.

- విజయనగరం జిల్లా జియ్యన్నవలస గ్రామంలో 60 మంది మహిళలకు అమ్మఒడి డబ్బు రాలేదని తెలిసి ఐద్వా ఆధ్వర్యంలో కలెక్టరేట్ వద్ద ధర్నా చేసి వినతిపత్రం ఇచ్చారు.

- కాకినాడలో ప్రజాసంఘాలు, యుటిఎఫ్ సంయుక్తంగా ఏర్పాటుచేసిన కొవిడ్ సెంటర్‌లోని బాధితులను కలిసి ఐద్వా జిల్లా కార్యదర్శి సిహెచ్ రమణి వారికి కౌన్సెలింగ్ చేశారు.

-విశాఖలో ఉక్కు ఉద్యమానికి వివిధ రూపాల్లో ఐద్వా కార్యక్రమాల్లో భాగస్వామి అయింది.



తిరుపతిలో..

**- శిక్షణా తరగతులు...**

మహిళా సంఘం జిల్లా కమిటీ సభ్యులకు నాలుగు రోజులు, యువతులకు రోజుకు రెండు సార్లు 15 రోజులపాటు శిక్షణ తరగతులు జరిగాయి.

# సూర్యావతి గారి శత జయంతి

## సందర్భంగా అభినందనలతో..

# శ్రీ వివేకానంద హాస్పటల్

ఆర్.టి.సి.కాంప్లెక్స్ ఇన్‌గేట్ ఎదురుగా, శ్రీ వివేకానందనగర్, అనకాపల్లి.

# డా.ఎం.దేవి వినయ గారు

ఎం.డి (General Medicine)

**(జనరల్ మెడిసిన్)**

షుగర్, బి.బి., థైరాయిడ్ మరియు జనరల్ వ్యాధుల వైద్య నిపుణులు

సోమవారం నుంచి
శనివారం వరకు
సాయంత్రం
4 గంటల నుండి
రాత్రి 7 గంటల వరకు

**ఈ వ్యాధులకు చికిత్స చేయబడును :**

బి.పి, - షుగర్ - జ్వరం - పక్షవాతం - పచ్చకామెర్లు ఊపిరితిత్తుల సమస్యలు - మూర్ఛ - గుండె జబ్బులు గ్యాస్ట్రిక్ సమస్యలు - నరాల సమస్యలు - కాలేయం - మూత్రపిండ సమస్యలకు చికిత్స చేయబడును.

అపాయింట్‌మెంట్
కొరకు సంప్రదించవలసిన
ఫోన్ నంబర్లు :
08924 223112,
08924 226869.



డాక్టర్ కె.వి.సత్యవతి గారు

ప్రసూతి వైద్య నిపుణురాలు





డాక్టర్ కె.విష్ణుమూర్తి

చెవి,ముక్కు, గొంతు వైద్య నిపుణులు

Post Reg.No.GTR/104/2020-22 R.NO. APBIL/2019/78298 Published on 5th july 2021 Posting on 7th & 10th july 2021

CHAITANYA MANAVI Vol : 3, ISSUE :6,7 GUNTUR, June, July 2021, pages : 56, Rs.20/-

| | |
|---|---|
|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A 202 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 21-8-2023 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | MOUNIKA |
| పేజీలు విడదీసినది | mounika |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |